# నిజంకుడా అబద్ధమే

[ మొలియర్ రూపకాలలో రెండింటి అనుసరణాల సంపుటి ]

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు :
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల
రూపాయి

## హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే లేక సొమ్ము వసూలు చేసుకొనేనిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఏదైనా సభఎదట ఆడదలచిన ప్రతిసంఘంవారున్నూ ముందుగానే గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం, కాపీరైట్ చట్ట ప్రకారం ఒకనేరం గనక, ఆ సంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

[illegible]

మొదటి ముద్రణ
1955

## వి ష య సూ చి క

# మో లి య ర్

"మోలియర్" ఒక ఫ్రెంచికవి; నాటకకారుడు; నటుడు. అతని పుట్టుక 1622. మరణం 1673. హాస్యరసప్రపంచంలో అతనిది పెద్ద పేరు. అతడు సుమారు ముప్ఫై ప్రదర్శనాలు వ్రాశాడు. అతని కథాసందర్భం అపూర్వం; చమత్కారం అఖండం; అనుభవం అపారం; భాషాజ్ఞానం అద్వితీయం; శోధన తీవ్రం. అప్పుడు తన దేశంలో ఉండే సంఘం యొక్క దురాచారాలున్నూ వ్యక్తులయొక్క అవగుణాలున్నూ అతడు పరిహాసించి వ్రాసినా, శాశ్వతత్వం ఇచ్చే లక్షణాలు కొన్ని అతని రచనలో ఉండడంవల్లే నేటివరకూ అతని ప్రదర్శనాలు అన్య దేశీయుల్ని కూడా ఆకర్షిస్తున్నాయి.

అనుసరణకర్త

# జరగాలి అనుకోవాలి

## పాత్రలు

| | |
|---|---|
| చంద్రం | (లీలని ప్రేమించినవాడు) |
| నీలాలు | (చంద్రం నౌఖరు) |
| పంకజం | (లీలని ప్రేమించిన మరొకడు) |
| శానయ్య | (పంకజం నౌఖరు) |
| అంబయ్య | (లీల తండ్రి) |
| కూర్మయ్య | (పంకజం తండ్రి) |
| లీల | (అంబయ్య కుమార్తె) |
| రమణ | (మగ వేషంలో ఉన్న వ్యక్తి, అంబయ్యకుమార్తె) |
| మిరియం | (అంబయ్య ఇంట్లో దాసి) |

రంగం—వచ్చే పాత్రలు

1—చం, నీ, మి, పం, శా

2—ర, మి, లీ, అం, శా

3—కూ, అం, పం, శా

4—మి, ర, చం, లీ

5—శా, పం. ర, మి, కూ, అం, చం, లీ, నీ

## పాత్ర—వచ్చే రంగాలు

చం—1, 4, 5
సి—1, 4, 5
షం—1, 3, 5
శా—1, 2, 3, 5
అం—2, 3, 5
కూ—3, 5
లీ—2, 4, 5
ర—2, 4, 5
బు—1, 2, 4, 5

# రంగం-1

[ఒకహాలు. వెనకాల రెండు మూడు కుర్చీలు. ఎ. మ. నించి చికాకుగా చంద్రం వస్తాడు, వెనకాలే ఉత్సాహంగా నీలాలు వస్తాడు]

చం—నీలాలూ ! నీ అభిప్రాయం ప్రమాణంగా చెప్పు. దాచకు.

నీ—ఎంతైనా ప్రమాణం అండీ. లీలగారికి మీూ మీూదే మోజు.

చం—నాకు నమ్మకం లేదు.

నీ—నాకు చాలా బలువైన నమ్మకం ఉంథండి.

చం—అయితేమరీ, ఆ పంకజంగాడూ.........

నీ—మీూ పోటీదారా ?

చం—అవును. వాడింకా కులుకుతూనే ఉన్నాడే ! లీల నన్నే స్థిరపరుచుగోడం నిజం అయుంటే, పంకజంగాడు కాస్త వెర్రిమొహం వేసి, ఒఖ్ఖరవ్వ అసూయ కనపరుస్తూ కొంతవరకు దివాలా తీసినట్టు ఉండద్దూ ?

నీ—అల్లా ఉండవలిసిన అవసరం ఏమిటండీ ? ఆయన మరో సంబంధం చూసుగున్నాడేమో !

చం—ఒక సంబంధం తాడో పేడో తేలందీ, రెండోది వెతుకుతాడా ఎవడేనా ?

నీ—వెతక్కపోతే ఉరెట్టుగో నీండి, మనకేం ? మీూ సొమ్ము మీూ ఒళ్ళో పడుతూండే టప్పుడు తకిటనవాళ్ళ

తవాయిలు మీ కేంటనుకంటి? లీలగారు మీకు స్పష్టంగా దాఖలా ఇచ్చారుగదా, మీకు మరేం కావాలి?

చం___ఏమో, నా భయం భయంలానే ఉంది. కానీ! (అని తల ఊగిస్తాడు)

నీ—మీరంటే లీలగారి గురించి శంకిస్తున్నారుగాని, ఆవిడ దాసీగురించి నాకు సందేహంఅన్న మాటేలేదూ!... (కు. మ. కి చూస్తూ) ఆగం డాగండి. అదుగో, వస్తోంది— లీలగారి దాసీ, మిరియం!

(కు. ఎ. వించి మిరియం వస్తుంది).

నీ—ఇదుగో, మిరియం!

మి—ఇదుగో! ఏమిటి కథ?

నీ—ఏముందీ? నిన్ను గురించే!

మి—(చంద్రాన్ని చూసి) తమరూ ఉన్నారా? గంట నించి మీకోసం ఊరూ నాడూ గాలించాను. మీరుగాని మీలాంటి వాళ్ళుగాని కనపడలేదు. అబద్ధం అయితే చెంప ఊడ్చండి.

చం—నా కోసమే! నా కోసమే!

మి—అయ్యో, మీ కోసమేనండీ! తిరిగేసరికి కాళ్ళరిగి పొట్టిఅయి పోయాను కూడానూ! ఎన్ని చోట్ల, ఎన్ని చోట్ల!

చం—చాలా చోట్ల కూడానా?

మి—ఁ, ఇళ్ళు వీధులు గుళ్ళు గోపురాలు...

చం—సరే ఒప్పుగున్నాను. సంగతేమిటి? నిన్ను పంపించిం దెవరూ?

మి—మీకు మరేమీ శ్రద్ధుల్లు కాడులెండి! మా యజమానురాలే!

చం—నిజమేకద, మిరియం! యథార్థమేకద, సత్యమే కద! నేను శాస్త్ర స్థాయిగా ఆనందపడవచ్చు కద! మీ యజమానురాలు నన్ను ప్రేమిస్తూన్నట్టు నటించడం లేదు కద, కొంపతవ్వి!

మి—అయ్యో కూతరా, ఎల్లాంటి ఊహాలండీ మీవీ! ఆమె తన ప్రేమ స్పష్టంగా మీ యెదటే బజాయించి చెప్పే శారే, మీను నిదర్శనం ఇంకా ఏంవాకాలీ?

నీ—ఏం కావాలా! వీరి పోటీదా రున్నాడే, పంకజం—ఆయన వెంటనే వెళ్ళి మెడకి చిన్న ఉరి పోసుగోవాలి. అల్లాంటిపని కాస్తంత జరిగితేగాని, వీరికి నమ్మకం కుదరదు.

మి—ఎంచేత?

నీ—ఈయనకి అసూయ అపారం!

మి—పంకజంగారిమీదా! సెబాసు! వీరింకా జ్ఞాను లేవో అనుకున్నాను, నిజం అయిందికాదు, నయమే. సరేకాని, (నీలాలుతో) తమకేమాత్రం, అసూయ?

నీ—అసూయకీ నాకూ వైరం. నేను నమ్మకంమీద నడుస్తాను. నన్ను తిన్నగాచూసిన కళ్ళకి మరోదు భావ్యంగా

నచ్చడు. నా మాత్రం వాడు భూమ్మీద మరోడు ఉండడని నాకు తెలుసు.

మి—నీ బడాయిలు నాకు తెలుసు! ఏమైనా, అసూయ కూడదు. అది మనిషిని దొలుస్తుంది.

చం—సరేసరే. ఆ ప్రసంగం చాలు. ఏమిటిప్పుడు నీ రాయబారం?

మి—అసలు మీరు కనపడకపోడంవల్ల ఇంతాలస్యం అయింది గనక, నేను మిమ్మల్ని శిక్షించడానికి మరికాస్త ఆలస్యం చెయ్యడం న్యాయం! కాని, నేను అట్లా చెయ్యను. ఇదుగో ఉత్తరం చదువుకోండి.

చం—ఆహాహా! ఏదీ? తే. పైకే చదువుతాను, ఇతరులు లేరుగా! (అని, ఉత్తరం పుచ్చుగుని చూస్తూ) "ప్రాణప్రియా! నామీద మీకున్న ప్రేమ ఋజువుకోసం తమరు ఏమైనాసరే చేసేస్తానని అన్నారు. ఆ ప్రేమ నేడే ఫలించాలీఅంటే, మా నాన్నగారి అంగీకారం పొందండి. నా మనస్సు మీరు ఎంతమట్టుకు స్వాధీనపరుచుగున్నారో, వారితో చెప్పండి. ఆ విషయంలో మీకు సర్వాధికారం ఇచ్చాను. ఆయన జవాబు అనుకూలంగా ఉంటే, తమకు నేను దాసురాల్ని—ఇట్లు, లీల." ఓహోహో! ఏమి సందేశమండీ! మిరియం? నువ్వు దేవదూతవు గాని, సామాన్యవు కావు.

సీ—నేను చెప్పలేదుటండీ, తమరు నమ్మరుగానీ! నా అంచనా ఎన్నడూ తప్పదు.

చం—(సగర్వంగా పచారు చేస్తూ ఉత్తరం కేసి చూస్తూ) "నా మనస్సు మీరు ఎంతమట్టుకు స్వాధీన పరుచుగున్నారో—" ఆహాహా, ఓహోహో! ఏమిభాష, ఏమిభావ!

మి—ఇదేమరి! ఈ చాదస్తం ఆవిడతో చెప్పానంటే, ఆవిడ ఈ ఉత్తరం కాస్తా ఉపసంహారం చేసేసుగుంటుంది. మీరు కూచోవాలి.

చం—అరె! ఇది నిజంలా కనిపిస్తోందా, లేక నిజంగా నిజమేనా. అనే సందేహంచొప్పున, ఉత్తరం పరీక్షగా గమనిస్తూంటే, ఈసంగతీ నువ్వొక్కడికి టపా మోసెయ్యాలీ! అల్లా ఒకవేళ నువ్వు మోసేస్తే, అందుకు ఒకవేళ లీల కోపిస్తే, నాప్రాణాలు ఆ లీలయొక్క పాదపద్మాలదగ్గిర దాఖలుచెయ్యడానికి నేను తయారుగా ఉన్నాననికూడా చెప్పు, అనగా మరణించడానికే అను.

మి—అవేంమాటలండీ, యిప్పుడూ?

చం—అవునుగద! అటువంటప్పుడు జాగర్తగా మాట్లాడుమరి. ఇంత సుందరమైన సందేశం తేవడానికి నువ్వుపడ్డశ్రమకి నీకు బహుమతీ చేస్తాగా!

మి—శ్రమా, శ్రమన్నారా! ఆ పాపుదగ్గిర మరీనూ!

చం—ఏపాపూ?

మి—వెనక నాకు ఓ ఉంగరం కొనిపెడతానన్లేదూ?—ఆ షాపు.

నీ—ఆసి టక్కరీ! నీకు ఉంగరంకూడానా!

చం—తరవాత కొంటాలే! పోనీ, ఇప్పుడిది పుచ్చుకో! (అని యిస్తాడు)

మి—(పుచ్చుకుంటూ) ఏదో, కాస్త జ్ఞాపకంకోసం.

చం—నువ్వు ఈ వ్యాపారం గట్టుదిట్టం చెయ్యాలి.

మి—ఓ. నిమిషం. మరి, మీ ప్రేమమాటేమిటండీ, ఊరుకున్నారేం?

నీ—మనసంగతి నిమిషం. ఎప్పుడో నిన్ను అడుగుతాను: 'పెళ్ళి ఆడదామా?' అని.

మి—(సిగ్గుతో) అప్పుడు నేను ఊరుకుంటాను.

నీ—అయినా చాలు, అంతే!

మి—(కు. వె. కి వెడుతుంది.)

[కు. ఎ. నించి పంకజం వస్తాడు]

చం—పంకజంలా ఉన్నాడే!

పం—ఏం చంద్రం?

చం—రా, రా. నీ మోహం ఏమట్టుకొచ్చింది?

పం—నీ కోమలప్రేమ ఎట్లా ఉంది?

చం—నా మోహం దినదినం బలీయం అవుతోంది.

పం—నా ప్రేమ దినదినం బ్రహ్మాండమైపోతోంది.

చం—లీలగురించేనా నీ ప్రేమ ?

పం—అవును.

చం—ఆహాహా ! ప్రేమలో నిశ్చలత్వానికి నువ్వు మంచి నిదర్శనం.

పం—నీ ప్రేమ కేవలం ధ్రువనక్షత్రం.

చం—అవతలవ్యక్తి వించి పూర్ణప్రేమ బయల్దేరి నన్ను చేరుకోవచ్చినప్పుడుగాని, నా ప్రేమ ఆ దిశలో పంప నే పంపను.

పం—నేనూ అంతే !

చం—ముఖ్యంగా, లీల

పం—అవును, లీలే ! లీల మనస్సు చూవత్తూ నాకు నచ్చింది.

చం—నువ్వు ఉత్త అల్పసంతోషిపిలా ఉన్నావ్ ?

పం—నువ్వు అనుకున్నంతగా కాదు.

చం—చెబితే గర్వం అనుకుంటావుగాని, ఆమె నన్ను ప్రేమిస్తోంది అనడానికి ప్రబలకారణాలున్నాయి.

పం—చెప్పకపోతే తెలియనే తెలియదుగనక చెబుతున్నానుగాని, ఆమె ప్రేమలో పెద్దవాటా నా కిచ్చేసిందన డానికి అమోఘ నిదర్శనాలున్నాయి.

చం—మనకి చనువుగనక చెబుతున్నాను, దగా పడకుస్మీ !

పం—నీతోగనక అంటున్నాను, చూసిందల్లా నమ్మకుస్మీ!

చం—ఈపళంగా దాఖలా కనపరిచానంటే, ఏడ్చి పోతావని ఊరుకుంటున్నాను.

పం—ఈ మట్టున ఓ రహస్యం చేప్పేశానంటే మొత్తు గుని గోలెడతావని వివేకం వహించి ఆగిపోతున్నాను.

చం—వ్యవహారం అంతమట్టుకొచ్చిందీ! సరే. నా కిష్టం లేదుగాని, అయినా ఈ ఉత్త్రరం చూడు.

పం—(ఉత్త్రరం పూర్తిగా చూడ్డం నటించి) మాటలు ముద్దొస్తున్నాయి.

చం—దస్తూరీ చూస్కో (అని పచారు చేస్తాడు)

పం—దస్తూరీకేం! లీలదే!

చం—దాన్నిబట్టి ఏమిటీ?

పం—(పకపకా నవ్వుతూ) సెలవ్, చంద్రం, పోతాను. (అని, కు. మ. కి వెళ్ళిపోతాడు.)

నీ—ఈయనకి పిచ్చెత్తి ఉండాలి. తను నవ్వుతాడేం, ఏడవకా!

చం—ఏమో! నేను మళ్ళీ సందిగ్ధావస్థలో పడ్డాను. వీడు నవ్వడాన్నిబట్టి చూస్తే నాకు తెలియని రహస్యం ఏదో ఉంది, దారుణమైంది!

నీ—(కు. ఎ. కి చూస్తూ) అడుగో నండోయ్, అయన గారి నౌఖరు శానయ్య వస్తున్నాడు.

చం—రానీ రానీ! కొంచెం నాటకం ఆడి, సంగతి ఏమన్నా ఉంటే, వీడిచేత కక్కిద్దాం ఉండు.

(కు. ఎ. నించి శానయ్య వస్తాడు.)

సీ—ఇదుగో, శానయ్యా !

శా—ఇదుగో సీలాలూ !

సీ—ఎక్కడికి ప్రయాణం ? వెనక్కి వచ్చేస్తున్నావా, ముందుకి సాగిపోతున్నావా, ఇక్కడ ఆగుతున్నావా ?

శా—ఎక్కడికీ వెళ్ళ లేదు గనక వెనక్కి రావడం లేదు, ఆగిపోయాను గనక ముందుకి సాగిపోడం లేదు, తక్షణం పోతున్నాను గనక ఆగడం లేదు.

చం—నీ వాదన బహు చిక్కనగా ఉంది. కాని, ఓమాట !

శా—చిత్తం. నమస్కారం. విధేయుణ్ణి.

చం—పోతాను పోతానంటున్నావ్, మేమంటే భయమా ?

శా—నాకు ఏవరి భయమూ లేదు. అందులోనూ మీ అంత మర్యాదస్తుల దగ్గిర అసలు భయమేమిటి, నా మొహం!

చం—అహాఁ, ఒక వేళ భయపడుతున్నావేమో, ఏమీ భయపడకు. నేను లీల సంబంధం వదులుకున్నాను. మనం ఇక స్నేహంగా ఉండచ్చు. ఈర్ష్యలకి తావేలేదు.

శా—నిజంగా ! నిజంగానే నండీ ?

చం—ఆ నేను మరో బేరం చూసుకుంటున్నాను. కావలిస్తే సీలాల్ని అడుగు.

శా—ఏం సీలాలూ ?

నీ—ఓ నిజమే. పైగా, మరోటీ నేనూ మిరియం గురించి నీళ్ళు వసులుకున్నాను. నువ్వే స్వీకరించు.

శా—(చంద్రంతో) ఇకంతా వేళాకోళమూ, నిజమూ అండీ ?

చం—పంకజంతో పోటీకి నేను తగనని నాకు తెలిసి పోయింది, లీలని వసులుకున్నాను. ఇంకా నిజమూ కాదా అంటూ సందేహం ఎందుకూ ?

శా—బతికి చారండీ, బాబూ! ఆ అమ్మాయి మొదట్నించీ ఇంతేనండి. మిమ్మల్ని తమాషా చెయ్యడానికి ఇన్నాళ్ళనించీ నటిస్తోచ్చింది. పాపం ఆమాట నాకు వెనక నించీ తెలుసు. మీరంటే జాలి పడేవాణ్ణి, రహస్యంగా కూమని! కాని, ఆ అతిరహస్యం ఎల్లా పొక్కిందండీ. వాళ్ళిద్దరికీ, అనగా మా యజమానికీ లీలగారికీ పెళ్ళి అయిన సంగతి, అప్పుడే, మీ చెవిని ఎల్లాపడిందీ ?

చం—(నిర్ఘాంతపోతూ) ఏమిటీ ?

శా—(నవ్వుతూ) వారి పెళ్ళి రహస్యం అప్పుడే మీతో ఎవరు ఊదేశారండీ? చిత్రంగా ఉందే !

చం—ఛీ ఊరుకో. అబద్ధం.

శా—అబద్ధమా ? అనుకోండి.

చం—పోరా, భ్రష్టా !

శా—నే నెల్లాగండీ అవడం ? పెళ్ళివాళ్ళిద్దరికీ అయితే !

చం—అందుకోసం నిన్నిప్పుడు బాదాలి.

శా—అల్లా అన్నారు, బోధపడింది.

చం—అయ్యో, నీలాలూ! (అని, శానయ్యతో) ఏం? పారిపోవాలనా?

శా—నే నాండి, పారిపోనండి

చం—ఏం శానయ్యా! లీలకి పెళ్ళి అయిందా?

శా—(నవ్వుతూ) అబ్బే, వట్టిదండీ, ఊరికే అన్నాను.

చం—ఊరికే అంటావురా, ద్రోహీ!

శా—అయితే, ఊరికే అనలేదండీ! ఏదీ నమ్మరే, ఎక్కడోగానీ!

చం—అయితే, నిజమే?

శా—ఏమోనండీ, నా జిహ్వాచ్ఛుగుని, నేనేమీ అనను.

చం—మరేమిటి నీ ఉద్దేశం?

శా—ఇప్పు డేమీ లేదు. ఏమంటే ఏం తప్పో!

చం—ప్రమాణికంగా చెప్పు, పెళ్ళిమాట నిజమూ అబద్ధమూ!

శా—మీ మాటకీ ఊరుకోడం ఎందుకు, మీ మనస్సులో ఉన్న ప్రకారమే అయిందండి.

చం—తిన్నగా చెబుతావా, చెప్పవా? (అని కత్తి తీస్తాడు.)

శా—పోనీ, నన్ను చావపొడిచి, పంపించెయ్యండి!

చం—సత్యమేనా చెప్పేయ్, ప్రాణమేనా ఇచ్చేయ్ పొడిచేస్తా!

ర—నన్ను లీల ఎవరని భావిస్తోంచ్ ?

మి—తమ్ముడని.

ర—నాన్నగారు ?

మి—అంబయ్యగారు మిమ్మల్ని కొడుకని భావిస్తున్నారు.

ర—నువ్వేమను కుంటున్నావ్ ?

మి—నేను మరో మోస్తరుగా అనుకుంటున్నాను.

ర—అయితే, ఎవరితోనూ చెప్పవ్ గద ! ఒట్టెట్టు.

మి—ఒట్టండి. కావలిస్తే మట్టి నోట్లో వేసు గుంటాను.

ర—వద్దువద్దు. నీకు నన్ను గురించి ఏం తెలుసో చెప్పు.

మి—మా అమ్మ మీ అమ్మగారి దాసీ. మీరు ఆడపిల్ల అయినట్టు తనిక పోతుందనగా మా అమ్మ నాతో చెప్పింది.

ర—నేని వూరొచ్చిన క్షణంనించీ నీకా సంగతి తెలుసు నన్న మాటే ?

మి—ఆ. కొడుకుకోసం మీ నాన్నగారు అప్పట్లో పరితపించారట. అందుకు కారణం మీ అమ్మగారు ఎరగ రట. కాని, తీరా మీరు పుట్టుగొచ్చారట.

ర—అందుకని, నన్ను ఇంకోచోట పడేసి, మరో మొగ పిల్లాణ్ణి తెప్పించి, ఆ పిల్లాణ్ణి మా అమ్మ రహస్యంగా పెంచిం దన్నమాట !

మి—మరే. ఒక పూలమ్మికి లంచం ఇచ్చి ! జనం అంతా అంబయ్యగారికి కొడుకుపుట్టాడను కున్నారు. పుట్టిన

శిశువుని చూడకముందే నాన్నగారు పనిమీద దేశాంతరం వెళ్ళారు కాని, ఆ పిల్లాడు వెంటనే చచ్చిపోయాడు.

ర—మా అమ్మ ఏం జేసిందీ ?

మి—ఆ సంగతి తెలియనీకుండా చూసి, మిమ్మల్ని తెప్పించేసి, మొగ వేషంలోనే మిమ్మల్ని పెంచడం మొదలెట్టారు. ఇంతలో ఆవిడకి మరణం తోసుకొచ్చింది. మీ పింతల్లిగారింటికి మిమ్మల్ని ఆవిడే పంపేసింది. మరేమీ నాకు తెలియదు.

ర—మా పింతల్లికీ ఆవిడ భర్తకీ కూడా నా రహస్యం తెలుసు. అక్కడ నేను అమ్మాయినే! ఈ మధ్య కొడుకుని చూడ్డానికి వస్తానంటూ మా నాన్న నా పింతల్లిగారికి ఉత్తరం రాశాడు. వాళ్ళకి భయం వేసింది. ఆ ఉత్తరం అందనట్టు, ఆవిడ భర్త నన్ను వెంటబెట్టుకుని పుణ్యక్షేత్రాలు చూసే మిషమీద తీసుకుపోయి కాలయాపన చేసి, తిరిగి తీసుకు వచ్చిం తరవాత, మొగవేషంవేసి మా పింతల్లి నన్నిక్కడికి పంపించింది. సరే కాని, మా నాన్న ఈ క్షోభ అంతా ఎందుకు పడ్డాడో తెలుసా ?

మి—ఆ. మీకు తెలుసో లేదో అని ఊరుకున్నాను. మీ నాన్నగారికి మొగపిల్లాడుంటే పెద్దఆస్తి కలుస్తుందిట.

ర—సరే. కాని, ఇప్పుడు నా అవస్థ విన్నావా ?

మి—ఏమిటండీ ?

ర—నేను వేషంతో లోకాన్ని కన్నుమూశాను గాని, మన్మథుణ్ణి మోసగించడం ఎల్లా? మనస్సుకి తగిలే బాణాలకి వేషం లెఖ్ఖ ఏముందీ?

మి—తమకి అప్పుడే మోహమే?

ర—అంతటితో అయిందా! నీ కింకా ఆశ్చర్యం వేసే సంగతి మరోటీ!

మి—ఏమిటీ?

ర—నేను ప్రేమిస్తూన్నది పంకజాన్నే. అదీ వింత.

మి—మరేనండోయ్. ఒకవేళ మీనాన్నగారికి మగ సంతానం లేకపోతే, రాబోయే ఆ ఆస్తి యావత్తూ పంకజం గారి తండ్రి సూర్యయ్యగారికే చెందుతుందిట. అందుచేత మీ స్త్రీత్వంసంగతి పంకజంగారికి తెలియడంతోటే, మీ నాన్నగారికి రాబోయే ఆస్తి ఛీదాగా లాగేసుకోడమే వారు చేసే మొదటిపని. తమ సంగతి వింతా, వింతన్నరా!

ర—ఇంకా వింత ఏమిటంటే, అతనికి నేను భార్యనే.

మి—అయ్యో దేవుడా! ఇహ నెట్లాగమ్మా ఇకవడమూ? అప్పుడే!

ర—అవును.

మి—ఏమోనమ్మా! నాకు బోధపడ లేదు.

ర—మరీ గొప్పవింత ఏమిటంటే, నేను తనకి భార్యనని గాని, నేనెవరైనదీగాని ఆయన ఎరగడు.

మి—అబ్బో, ఆగండి, నాకు మతి అసలేపోతోంది.

ర—ఏంలేదు, చెబుతానివిను బోధపడుతుంది. పంకజం మా లీలని వరించినవాళ్ళల్లో ఒకడు. నువ్వు లేనప్పుడు వస్తాడు. కాని, మా అక్కతో నేను ఉన్నప్పుడే మాట్లాడతాడు. తన ప్రేమ వెళ్ళబోసుకుని, తిరిగి తనని ప్రేమించవలసిందని మా లీలనికోరి, అర్థించి, ప్రార్థించి ఆరాధిస్తాడు. మాలీల పెడమొహం పెడుతుంది.

అలాంటప్పుడు నేను, అటువంటివరుణ్ణి వదులుకోవద్దని మా అక్కని కూకలేసి, అతణ్ణి కొంచెం గొప్పచేస్తూండే దాన్ని. దాంతో నాకు తెలియకుండానే నా మనస్సు అతనికేసి జారింది. మా లీలదృష్టిలో వ్యర్థంగా తోచిన సంభావణ నా మనస్సుని హరించింది. బాకీపడ్డది మా అక్కగారైనా, ఋణం తీర్చినదాన్ని నేను.

మి—పైకి అమాయికంగా కనిపిస్తూ ఎంతగ్రంథం నడిపించారు రమణగారూ! ఇల్లాంటి వ్యాపారసందర్భం వచ్చేసరికి ఎల్లాంటివాళ్ళకీకూడా ఎక్కడలేని ఇదీ బయల్దేరుతుంది గావును.

ర—నేను పంకజంతో కొంత మాట్లాడాను—అదొక మోస్తరుగా! చమత్కారంగా! ఒకవిధంగా ఆయన్ని కట్టేశాను.

మి—ఎట్లా?

ర—ఆయనా నేనూ ఒకసారి ఒంటరిగా కలుసుకున్నాం. నేనే స్త్రీనైతే అతణ్ణే వరించుండేదాన్నని అనేశాను.

దాంతో అతనికి ధైర్యంరాగా తన మోహవ్యాపారంలో నా సాయం ఆయన కోరాడు. నా ప్రేమవిషయం తను కృషి చేస్తే తన ప్రేమవిషయం నేను కృషి చేసిపెడతానని మాటిచ్చాను. నేను తన చెల్లెల్ని మోహిస్తున్నాను గావు ననుకుని, అందుకాయన సరేఅని అంగీకరించాడు. మా అక్క మనస్సు పంకజంగారికేసి ప్రవహించకుండా ఇక్క ణ్ణించేనా జాగ్రత్తపడి అరికట్టాలి.

మి—(కు. మ. కేసి చూస్తూ) అదుగో, మీ అక్క! మీరు లోపలికి వెళ్ళిపొండి.

(ఎ. మ. కి నిష్క్రమిస్తుంది)

లీ—(కు. మ. నించి వస్తూ) ఏం మిరియం! నాన్న ఉన్నారా?

మి—లేరు.

లీ—ఏం జరిగింది అక్కడ?

మి—మొదటవెళ్ళి ఉత్తరం ఇయ్యగానే అది చదువు కుంటూ చంద్రంగారు బుట్టబొమ్మలాగ ఆసీపోయారంటే నమ్మండి. అందులో మాటల్ని నన్నూ అదే మెచ్చడం అదే మెచ్చడం! కాని, రెండోమాటు వెళ్ళినప్పుడు నన్ను ఆయనా ఆ నీలాలూకూడా అదే కసరడం అదే కసరడం! ఆ మధ్యకాలంలో వాళ్ళిద్దరికీ కూడా ఏం జబ్బుచేసిందో నాకు తెలియదు. అంత అవమానం నేను పడ్డానుకాని మరోళ్ళు పడలేరు.

లీ—అంతమట్టుకొచ్చింది ! ఇంతపొగరా ? అయితే, నామనస్సు పంకజంకేసే పరిగెడుతోంది. నా దస్తూరీలో ఉన్న ఉత్తరానికి జరగవలిసిన మన్నన ఇదా ? ఇంక నువ్వు సమర్థించినా నేను సుతరామూ వినను. కర్మవశాన్ని చంద్రం వచ్చి నా కాళ్ళమీద పడవలిసిన అవసరం వస్తుం దనుకో, అప్పుడైనాసరే, అతని క్రౌర్యం నేను మరవను. చిట్టచివరికి ఒకవేళ నేను కొంత మెత్తపడినా, నువ్వో మాత్రం ధైర్యం వదలక ఆ నీలాలుగాణ్ణి తిరగేసికొట్టు.

మి—అద్దమా ! అతడి ధిక్కారానికితగ్గ ద్వేషం వహిస్తాను. అవసరాన్నిబట్టి, వివాహం మానడానికికూడా సిద్ధపడతాను. (కు. మ. కేసి చూసి) మీ నాన్న ! లోపలికి పోండి.

లీ—(ఎ. మ. కి వెళ్ళిపోతుంది.)

అం—(కు. మ. నించి వస్తూ) ఒసే, మిరియం! నువ్వెళ్ళి రమణ మేస్టారున్నాడేం, ఆయన్ని పిల్చుకురా ! ఆయన్తో నాకు పనుంది !

మి—చిత్తం. (అని కు. ఎ. కి వెళుతుంది.)

అం—(తనలో) ఒక్క చిన్న అన్యాయంచేసి ముందుకి సాగి పోదాం అనుకుంటే దారినిండా నూతులూ గోతు లూనూ ! పరాయివాణ్ణి తెచ్చి యింటో పెట్టుగుని, వాడే నా కుమారుడంటూ ఎన్నిపాట్లు పడుతున్నానో గదా, దిక్కుమాలి డబ్బుకోసం ! ఈ గొడవలు తల్చుగుంటే అసలు

ఎంతో మిక్కిలి రహస్యం—అయిన విషయం ఉందిట ఒకటి. కాస్సేపట్లో వారిక్కడికొచ్చి తమతో మాట్లాడ తారుట. సెలవ్! (అని, వెంటనే కు. మ. కి పోతాడు.)

అం—అయ్యో! వణుకొస్తోంది. కూర్మయ్యా నేనూ పరస్పరంగా అరుదుగా చూసుగుంటాం. ఇక్కడికొస్తానని ఇప్పుడు కబురు చేశాడు. రహస్యం అంటే నా మగ సంతానం గురించే అయి ఉంటుంది. ఎంత చిక్కు! అప్పట్లో నా మనస్సాక్షి చెప్పినట్టు నే విని, ఆ సొమ్ము కూర్మయ్యకి చెందజేస్తే ఎంత బాగుండి పోయేదీ! ఇప్పుడు నాకు నలుగురి లోనూ ఎంత తలవంపూ!...వేడ్చి ఏం లాభం, చెయిజారిం తరవాతా! ఈ ఆస్తి నాకు సంక్రమిం చడం నా ఆస్తికుడా పోగొట్టుకోవడం నాకు కేమో! ఏం తెలు స్తుందీ! కొత్తనీళ్ళొచ్చి పాతనీళ్ళు కొట్టుకుపోడం నాకు బోధపడుతోంది గావును! (అంటూ ఎ. మ. కి పోతూండగా)

(తెర)

---

## రంగం-3

[అంబయ్య ఇంటి హాలు. కుర్చీలు, ఒక బల్ల ఎదట పడక కుర్చీలో కూర్చుని అంబయ్య ఆలోచిస్తూ ఉంటాడు, కుడివేపునించి కూర్మయ్య వస్తాడు. అంబయ్య కుర్చీలో పడుకుని కళ్ళు మూసి ధ్యానిస్తూ ఉంటాడు]

కూ—(కు. ఎ. నించి వస్తూ) మా పంకజం అంతా సక్కవిసయుం. నే ఉండగా వాడు ఇన్ని పడేట్టు కనపడను.

రొండోకంటివాడికి పిసరంతేనా తెలియరానీకుండా వాడు ఈ అంబయ్యగారి లీలని పెళ్ళిచేసేసుగోడం ఆశ్చర్యంగా ఉంది! ఇది ఎల్లా పరిణమిస్తుందో! నాకు ఎటూ ఆలోచన పోవటం లేదు. ఈ ముసిలాడికి బోలెడాస్తి ఉంది, బోలెడు కోపం ఉంది. కానీ, ఒంటరిగా ఉన్నాడు. (అని అంబయ్య కేసి చూస్తూ) కునుకు పట్టింది గావును!

అం—(తనలో) అయ్యో, కూర్మయ్యా! హా దైవమా!

కూ—(తనలో) పాపం! ఇతణ్ణి పలకరించడం అంటే భయం వేస్తోంది.

అం—(తనలో) నాకు కాండలెత్తిపోతోంది.

కూ—(తనలో) నేను ఎల్లా మొదలు పెట్టనూ?

అం—(తనలో) ఏం చెప్ప మన్నావు నన్ను?

కూ—(తనలో) ఇతనికి మనస్సు మనస్సులో లేదు.

అం—(తనలో) నీ కప్పుడే ఆగ్రహం గావును!

కూ—(పైకి) అంబయ్యగారూ!

అం—(ఉలిక్కిపడి మెలుకువ తెచ్చుగుని కుర్చీలో కూచుంటాడు)

కూ—మీా ధోరణి చూస్తే, నే రావడం ఎందుకో మీాకు తెలిసి ఉండాలి.

అం—తెలియకేం! మా బాగా తెలుసు. కూర్చోవయ్యా!

కూ—మీాకీ వార్త వింతగా ఉండచ్చు. నేను ఇప్పుడిప్పుడే వింటూ! ఓ పట్టాన్ని నాకు నమ్మకం కుదరందే!

అం—ఏమైతేం, సిగ్గుపడవలిసిన వాణ్ణి నేనే.

కూ—ఇల్లాంటిపని గర్హించి అపరాధిని శిక్షించాలి, క్షమ కూడదు.

అం—కూడక పోవడేం! ఎంత పాపిష్టి వాళ్ళనైనా భగవంతుడు కనికరిస్తాడు.

కూ—ఇప్పుడు మీరే కనికరించాలి.

అం—మనం దేవుడి మొహంచూసి వ్యవహరించాలి.

కూ—తప్పకుండా.

అం—కనికరం చూపండి, కూర్మయ్యగారూ! తమరు నాకు పైవారు!

కూ—దయ చూపండి, ఇప్పుడు వేడుకో వలిసినవాణ్ణి నేను! తమరు పెద్దలు!

అం—ఇదుగో మొక్కరించి అర్థిస్తున్నాను (అని మొక్క రిస్తాడు)

కూ—అబ్బే, నేనూ అట్లా చెయ్యవలిసిన వాణ్ణే. (అని మొక్కరిస్తాడు).

అం—నా కొచ్చిన కర్మానికి నన్ను కనిపెట్టాలి.

కూ—జరిగిన దారుణానికి బతిమాలుకో వలిసింది నేనే.

అం—మీ మంచితనం అపారంగా ఉంది.

కూ—మీ వినయం చూస్తే నాకు కంగారు పుడు తోంది.

అం—సులీ్ఛ కోరుతున్నాను, క్షమించండి.

కూ——ముందు మీరు క్షమించండి, నన్ను.

అం——జరిగినదానికి నేను ఎంతో దుఃఖిస్తున్నాను.

కూ——మీకంటె ఎక్కువగా దుఃఖిస్తున్నాను, నేను.

అం——ఇది ఎక్కడా పబ్లీకు చెయ్యకండి.

కూ——సరి సరి, ఇదోటా!

అం——నా గౌరవం నిలబెట్టండి.

కూ——ఓ, దివ్యంగా.

అం——ఇక డబ్బుసంగతా, మీకు ఏం కావాలో మీరే స్థిరపరచండి.

కూ——అబ్బా, మీరు ఇష్టపడి ఇచ్చే దానికంటె మాకేందు కయ్యా! డబ్బు నీరే పైసలు చెయ్యండి, మీరు సంతోషించడమే మాకు పదివేలు.

అం——ఆ హా హా, మీరు దేవుడి వంటివారు. ఏమి ధారాళం, ఏమి మంచి, ఏమి నెమ్మది!

కూ——అబ్బో, మీరు ధర్మమూర్తులు. ఏమి క్షమ, ఏమి అంతఃకరణ, ఏమి కలిమిడి!

అం——మీరు పట్టింది బంగారం కావాలి.

కూ——మీరు చిరకాలం చల్లగా ఉండాలి.

అం——మరి లేస్తాను, అనుజ్ఞా?

కూ——అవశ్యం. ఎంతమాటా!

అం——(లేస్తాడు)

కూ——(లేస్తూ) వచ్చి మీతో అనేసిం దాకా నాకు తోచిందే కాదు. మీకు ధనం ఉంది, బలగం ఉంది. మీకేం

కోపం వస్తుందో కదా అని మహా భయపడి పోయాను, చెప్పద్దూ! పోనీ చెప్పాడా పడిశాడా! రహస్యపు పెళ్ళాయిరి!

అం—దేన్ని గురించి మీారనేది ?

కూ—బాగానే ఉంది. మా పంకజం చేసుకున్న రహస్యపు పెళ్ళి.

అం—ఎవర్ని ?

కూ—ఎవర్నో అయితే ఇక్కడికెందు కొస్తానూ! మీా లీలని.

అం—మా లీల గురించి ఏమిటి అంటున్నావ్ ?

కూ—అయిందేదో అయింది. లోటంతా మా వాడిదే. మీా పిల్ల సుగుణం అంతా ఎరుగుదురు. మా వాడే ఆ పిల్లని నమ్మించి ద్రోహంచేసి ఉంటాడు. ఆ సంగతి ఇక మరిచి పోదాం. మరి పబ్లీకుగా తక్షణం వాళ్ళపెళ్ళి చేసేద్దాం.

అం—(తనలో) ఓరి పీడి దుంప తెగా! నే నెంత పొరబడ్డానూ! కాని, ఈ కొత్తవార్తా అల్లాంటిదే! ఓ గోతులోంచి మరో గోతులో ప్రవేశం! ఇంకేమన్నా! మరేమన్నా అంటే నాగుట్టు కాస్తా నేనే పీధిని వేసుగుంటానేమో!

కూ—మీారేదో ఆలోచిస్తున్నారు ?

అం—ఏం లేదు. నాకు అకస్మాత్తుగా వంట్లో ఎల్లానో ఉంది. నేను మరి మాట్లాడలేను, పోతాను. మీారు వెళ్ళండి. (అని ఎ. ఘ. కి పోతాడు).

కూ—పాపం! ఎవడైనా అంతే. క్షమించాలని ఉద్దేశం ఇతడికి ఉన్నా దుఃఖం మిక్కుటం అయింది. తన బాధ తను ఒంటరిగా పడదాం అనుకుని ఈయన వెళ్ళిపోయుంటాడు. ఇతడి విచారం చూస్తే నాకు జాలేస్తోంది, ఇల్లాంటివి క్రమేపీగాని సర్దుకోవు. (కు. మ. కి చూస్తూ) ఇదుగో మా కుమార రత్నం, పంకజం, గ్రంథకర్త!

పం—(కు. మ. నించి వస్తాడు.)

కు—రా! మా నాయన, రా! ఈ ముసలితండ్రికి మిగిలిన ఈ కాసినిరోజులూ తిన్నగా వెళ్ళకూడదని నువ్వు పట్టుపట్టినట్టు తోస్తుంది. తెల్లారభయం! ఏదో కొత్తజట్టీ వస్తూంటుంది నీ మీదికి! మంచివిషయం నా చెవిని పడే యోగ్యత లేందే!

పం—అదేమిటి నాన్నా! అంత కోపానికి నేనేం జేశానూ?

కూ—(వెక్కిరిస్తూ) "నేనేం జేశానూ!" అంబయ్యగారి లీలని తీసికెళ్ళి రహస్యంగా పెళ్ళిచేసుగుని ఊరుకున్నావ్! ముందేమివస్తే నీకేం? నా కడుపుని చెడపుట్టావు నువ్వు. నీ కిహ ఎంతతోస్తే అంతే? ఔర! నేపోయేలోపల నీకు జ్ఞానోదయం కాదు. (అని, కోపంతో కు. ఎ. కి పోతాడు.)

పం—(ఒకడూ పచారుచేస్తూ) ఎవడిది చెప్మా, ఈ బనాయింపూ! మన శానయ్యదే అయుంటుంది. వాడుగా వచ్చి నా దగ్గిర నిజం యుగం తిరిగినా ఒప్పుగోడు. వాడల్లా

ఒప్పొగునే రకంకాదు. కోపం కాస్త వెనక్కిపట్టి నేను ఓమెత్తు వేస్తాను.

[కు. మ. నించి శానయ్య వస్తాడు]

పం—శానయ్యా! వచ్చావా? మనం పన్నిన రహస్యం మానాన్నకి తెలిసింది.

శా—మన రహస్యమా? మీ నాన్నకా?

పం—మరే.

శా—ఎల్లా తెలిసుంటుందండీ?

పం—ఏమో! నేను చెప్పొగోలేకుండా ఉన్నాను. అయితేంలే! మనం ఇప్పుడు సంతోషించాలికుడానూ! మా నాన్నకి ఏమీ కోపంరా లేదు. సరిగదా, (అని నవ్వనటిస్తూ) నువ్వుచేసిన పని భేషుగ్గా ఉందిరా అని నన్ను మెచ్చుగున్నాడుకుడానూ! ఆయన మనస్సు ఇంత ఆనందం పొందేటట్టు ఎవరు చేశారా అని మాత్రం అనుకుంటున్నాను.

శా—(నవ్వుతూ) ఇంకా మరొకరని చూస్తున్నారా యేమిటి? నే నేనండీ మీకింత ఆనందం చేకూర్చిందీ!

పం—ఛ. ఊరికే అంటున్నావుగావును!

శా—కాదండి, మహాప్రభూ! నేనే వెళ్ళి మీ నాన్నగారితో ఈమాట చెప్పాను!

పం—ప్రమాణంగా?

శా—ప్రమాణంగానండీ!

పం—(కత్తి దూసి) అయితే బహుమతీ ఇయ్యనా? దగాకోర్!

శా—ఏమిటి మీ ఉద్దేశం! నేను కాస్త ఆలోచన చేసుకోడానికేనా వ్యవధి లేకుండా ఏమిటి మీరా కత్తి లాగడం!

పం—ఇదా నీ విశ్వాసం? ఇంత ఎత్తు నేను వేస్తేగాని నువ్వు నాదగ్గిర నిజం కక్కలేదే! ద్రోహీ! నీకు నోట్లో నువ్ గింజనాన్దు. నిన్ను కత్తెడితే నరకాలి.

శా—నెమ్మది నెమ్మది! లేచిపోవడానికి నా జీవుడు తయారీలో లేని సమయంలో మీరల్లా హడావిడిపడి లాభం ఏమిటి? కొంచెం తమాయించి నామొత్తు చూడండి బాబూ! ఇది గొప్ప తప్పాఅండీ స్వామీ! మీ కోరిక సిద్ధించడానికి నేను ఏంజేస్తే ఏమిటండీ? సాధనమా సారాంశమా ప్రధానమైందీ?

పం—నీమొత్తు నెగ్గకపోతే?

శా—అప్పుడు సరే పోనీ నన్ను సావకాశంగా చంపుదురుగాని. నా పన్నాగం ఎన్నడూ వొట్టిపోలేదు.

పం—సరే. అయితే చూద్దాం.

శా—ఆగండి. (అని ఎ. మ. కేసి చూస్తూ) అదుగో, లోపల్నించి, లీలగారితండ్రి.

అం—(ఎ. మ. నించి వస్తూ, తనలో) ఇంతా హడిలిపోయి లీలని కనుక్కుంటినిగదా, ఏడుస్తూ 'ఈమాట శుద్ధ

అబద్ధం, ఎవరు కల్పించారోగాని' అని గోలెట్టింది. ఆ చెప్పడం వైఖరి గమనిస్తే, అమ్మాయి సత్యమే చెబుతూన్నట్టు తోస్తోంది. (పంకజాన్ని చూసి) ఇదుగో! నువ్వేనా, మహానుభావుడవ్, మా గౌరవం తీసెయ్యడానికి ఈ వెల్తిమాట పుట్టించినవాడవ్!

శా—తగ్గాలి అంబయ్యగారు! శాంతం శాంతం! కోపానికి కొంచెం కళ్ళెంపట్టండి. అల్లుడితో ఇల్లానేనా మాట్లాడడం?

అం—అల్లుడేమిటిరా, భడవా! నువ్వేగావును అసలు గ్రంధసాంగుడివి!

శా—మీకింత కోపం ఎందుకు వస్తోందో నాకు బోధపడలేదు. చాలా తమాషాగా ఉందే!

అం—మాపిల్లని యాగీచేసి, సంసారానికి తలవంపులు తేవడం తమాషాట్రా, నీకూ?

శా—చెప్పేమాట వినిపించుగోండీ! ఈయన తమరి చిత్తప్రకారం నడుచుగునే అల్లుడు.

అం—అతడిజోలి నాకెందుకూ! సత్యం ఆడాలి. ఒకవేళ అతడు మాలీలని ప్రేమిస్తే, సరసంగానూ మర్యాదగానూ ఉండద్దూ రీతి? విధిప్రకారం నా అనుమతి తీసుకోవద్దూ? పాడుమాట ముందే పుట్టించి ఎల్లాగో కార్యసానుకూలం చేసుగోచూస్తాడా?

శా—అయితే, లీలగారు ఈయన్ని పెళ్ళి చేసుగో లేదనే మీా వాదన ?

అం—ఛీ, పుంఢాకోర్ ! చేసుకోలేదు, ఇకమీాదట కుడా చేసుగోదు, నోరుముయ్ !

శా—ఒకవేళ రహస్యంగా పెళ్ళి చేసుగున్నారే, అనుకోండి. అది మీాకు ఒప్పుదలేనా?

అం—ఒకవేళ పెళ్ళిచేనేసుగో లేదనుకో, అప్పుడు నిన్ను కాటికకింద దంచి వస్త్రకాళితం చెయ్యొచ్చా ?

పం—వాడిమాట నేను ఋజువు చేస్తానండి.

అం—ఓరి! నాకరుకి తగ్గయజమాని! ఇద్దరూ చెరో అబద్ధాల పుట్టానూ !

శా—ఒట్టండీ! నా అంతవాడు చెప్తూంటే ఇంకా తిరుగేమిటి ?

పం—మిమ్మల్ని దగాచేస్తే మాకేం వస్తుందండీ, యధార్ధం చెప్పేశాంగానీ!

శా—అందాకా యెందుకూ! పోనీ ఆ అమ్మాయిని కేకేసి అడగండి, తీరిపోతుంది.

అం—అదీ అబద్ధం అడితే!

శా—వొదిలిపాయె! కాని, ఆ అమ్మాయి నిజం తప్ప మరోటి చెప్పదులెండి.

అం—అల్లాయితే ఉండండి. (అని ఎ.మ. కి వెళ్ళి 'లీలా' అని కేకేస్తాడు.)

లీ—(ఎ. మ. నించి వస్తుంది)

అం—(లీల వస్తూండగా) లీలా! ఇల్లారా! ఒక క్షణం.

శా—(లీలతో) అమ్మా! ఎల్లాగైతేం, ఆ సంగతి నాన్న గారు విన్నారు. మీ సంబంధం వారు ఆమోదించారు. ఎదురుగుండా భర్తగారున్నారు. మీరు ఆమాట ఒప్పేసు గోడం ఒక్కటే తరవాయి.

లీ—ఆమాటా? ఏమాటా! ఏమిటి ఈ లుచ్ఛా మాట్లాడేదీ?

శా—అప్పుడే ఎంత బిరుదుతో గౌరవించావమ్మా, తల్లీ నన్నూ!

పం—ప్రేయసీ! నువ్వు నా నౌకరు వాడి మాటలకి ఏమీ అనుకోకు. ఏం జేస్తాం? మన రహస్యవివాహం నలుగురికీ తెలిసిపోయింది.

లీ—మన రహస్య వివాహమా?

పం—కాదుమరీ! నా లీలా! యావత్తూ వెల్లడయింది. నిజం దాయడం మనవశమా?

లీ—(ఆశ్చర్యంగా) నేను నిన్ను గాఢప్రేమతో భర్తగా వరించానా?

పం—తెగేసి! పైగా ఇంత సౌఖ్యం నాకు అబ్బడం కొందరు చూడలేక కళ్ళల్లో నిప్పులోసుగుంటున్నారు. నీ మంచితనం కంటె ప్రేమే జాస్తి అవడం చేతనే నేను వొగ్గుతా! ఇది గుట్టుగా ఉంచమని నువ్వు నన్ను కోరావ్!

మరి నీకోపం ఎందుకంటే, నా వెఱ్ఱి సంతోషంలో ఆ రహస్యం నేను దాచలేకపోయానని.

శా—ఆ రహస్యం వెల్లడి చేసింది నేనండీ! సరా! ఏమిటి ప్రమాదం దానివల్లా?

లీ—అయ్యయ్యో! పుట్టిం తరవాత ఇంత ఘోరాబద్ధం విని ఎరగను. ఇల్లా వంచించి నన్ను గ్రహించాలనా? "ఈ పిల్ల మనస్సు తిప్పాగోలేకపోయాం. అందుకని, వీళ్ళ మర్యాద మసిచేస్తే, తండ్రి తహతహలాడిపోయి, పిల్లని నిర్బంధపెట్టి, పెళ్ళికి ఒప్పిస్తాడుగదా!" అనా ఈ ధీరుడి ఎత్తూ! అల్లా కుదరదు. కర్మమూ, తండ్రీ, మనస్సూ కలిసి నన్ను బలవంత పరిచినా సరే, నేను ఒప్పను. ఇంత నీచపు ఎత్తులు వేసేవాణ్ణి కట్టుగునే కంటె భస్మనయం. అబలని గనక ఇంతటితో ఆగాను.

పం—(శానయ్యతో) ఎల్లా శానయ్యా! మనం మాడి పోయేట్టున్నాం.

శా—నన్ను చెప్పనీండి! చూడవమ్మా, ఇంత అభి నయం ఎందుకమ్మా ఇప్పుడూ? ఏమిటి నీ ఆలోచనా? నీ కోరిక సిద్ధించే సమయంలో ఎదో పైత్యం నీలో ప్రవేశించి నిన్ను ఏమిగా చేస్తోందమ్మా! మీ నాన్న కోపిష్టి అయితే, సంగతి ఏమయేదో! కాని, ఆయన, నువ్వు ఒప్పేస్తుగుంటే సర్వం సొసాయింపు చేస్తానన్నారుగా! అవునుమరి పాపం!

మనస్సు విప్పి చెప్పేయ్యడానికి నీకు ఎంత సిగ్గురా! భాటంగా పెళ్ళికావాలి, అది సర్దుకోవాలి. మానవ శరీరం! ప్రమాదాలు వస్తూంటాయ్! జ్ఞానైనవాడు స్త్రీ జడపదార్థం అనుకోడు. ఇల్లాంటి ప్రమాదాలు నీతో మొదలూకాదు, ఆఖరూకాదు.

లీ—పొగరెక్కి వీళ్ళు ఇంత అమర్యాదాగా మాట్లాడుతూంటే, నువ్వు చూస్తూ ఊరుకుంటావేం, నాన్నా!

అం—ఏం జెయ్యనూ! నాకు మతి స్థిరంలేదు.

శా—అమ్మా! నే చెప్తా వినండీ! ఇంతమట్టుకి రానీకుండానే మీరు ఒప్పేసుగుని ఉండవలిసింది, యావత్తూకుడా!

లీ—ఏమిటి ఒప్పేసుగుని ఉండవలిసిందీ?

శా—ఏమిటా? చెప్పమన్నారా! మాయజమానిగారికీ మీకూ జరిగిన వ్యవహారం అంతానూ!—మంచి వేళాకోళమే!

లీ—ఓరి పొగరుమోతా? మీ యజమానికీ నాకూ జరిగిన వ్యవహారం ఏమిటిరా?

శా—అమ్మా! ఏమో! మీకే తెలియాలి. అతి సంతోషంలో ఒక వేళ మీరు ఆసంగతి మరిచిపోయారేమో! జ్ఞాపకం చేసుగోండి తొందరపడక, నిదానంగా.

లీ—నాయ్నా! ఇంతంతమాటలు నేను భరించలేను (అని, శానయ్యని ఒక్క చెంపకాయవేసి ఎడమకు వెడుతుంది. వెనకాలే, అంబయ్య వెడతాడు.)

పం—అయిందా! మరేమిటో జరుగుతుంది, చూద్దాం అన్నాన్!

శా—తెలిసిందండి. నా దినాలు సరిగ్గా లేవు. నాకోసం కర్రలూ తాళ్ళూ తయారవుతూన్నట్టు నాకు కనిపిస్తోంది. ఇక నేను ఎక్కణ్ణించేనా ఉరకడమో, ఎందులోనేనా దిగడమో నయం—నా నిరాశకి సరిపడ్డ ఎత్తున్నకొండో లోతున్న గొయ్యో దొరకాలిగాని!

పం—ఏడిశావులే! ఇక్కణ్ణించి చెపాయిం చెయ్యాలనా? ఆచావడం ఏమిటో నా మెడకే కానీ!

శా—తీరా యింకోరు చూస్తూంటే ఎల్లాగండీ చావడం? మీ రిల్లా పట్టడితే ఆలస్యం కూడా అవుతోంది.

పం—అల్లాయితే, రా! వీటుడి కోపం ఊరికేపోదని నీకు ఋజువు చేస్తా!

శా—(వెనకాలే కుడివేపునడుస్తూ, నెత్తికొట్టుగుంటూ). ఓరి! శానయ్యగా! వాళ్ళపాపాలూ వాళ్ళపాపాలూ నీ మెడకి ఎల్లా చుట్టుగుంటున్నాయిరా!

(తెర)

---

## రంగం-4

[గది : (మగవేషంలోనే) రమణి, మిరియమూ కూర్చుని ఉంటారు]

మి—చూశారా, ఎంత చిక్కులో పడ్డారో మీరు !

ర—మిరియం! నాకర్మం ఇల్లా ఉండగా, ఎవరు తప్పిస్తారూ! ఇప్పుడు శృతిమీరిపోయింది. లీలా, పంకజంకూడా నా సంగతి చూసి ఆశ్చర్యపడి, నిజం కనిపెట్టాలని చూస్తున్నారు. వాళ్ళు పోల్చేశారా, నాపని మట్టం. అంబయ్యగారికి నా సంగతి లోగడ తెలిసి ఉన్నా, ఇప్పుడే తెలిసినా, తన ఆస్తంతా పైవాళ్ళకి పోయిం తరవాత, నన్ను చూస్తే ఆయన మట్టుకు అసహ్యించుగోకుండా ఉంటాడా! అప్పుడు నేను విధిగా పరాయిదాన్నే అయిపోతాను. ఆ స్త్రీ సంప్రదాయం రెండూ లేనిదాన్ని అయిం తరవాత నన్ను కట్టుగోడానికి పంకజం వెర్రివాడా!

మి—మీ సబబు చక్కగా ఉంది. ఈ మాత్రం ఆలోచన తమరు వెనకే చేసి ఉండవలిసింది. ఇల్లా జరుగుతుందని ముందే గ్రహించడానికి, ఈ మాత్రానికి, ఏమన్నా సోది చెప్పడం నేర్చుగోవాలా! నాకు వెనకే తెలుసు.

ర—కాని, ఏం చెప్పనూ! నాకు తెలివి పోతోంది. నువ్వు నే ననుకుని చెప్పు!

మి—నేను మీరైౖ, మీరు నేనైతే, సలహా చెప్పవలిస్తింది మీరే అవుతారేమో! అయినా సరే. పోనిండి,

అల్లానే అనుకుంటాను. కాస్కోండి. హా నా మిరియం! (దీనంగా) చూశావా, నా స్థితి ఎంతవరకు వచ్చిందో! సలహా చెప్పమ్మా, నీకు చాలా పుణ్యాం ఉంటుంది!

ర—పోన్లేస్తూ! ఇదంతా వేళాకోళంలోకి దిం పేస్తున్నావా? నా సంతాపం నీకు సంతోషమా?

మి—అబ్బెబ్బే! వొట్టిదండీ! ఊరికే అన్నాను. నాకు చాలా విచారంగా ఉంది. నేను తమరు ఏది చెయ్యమంటే అది చేస్తాను. ఏమీ దారి కనపడటు.

ర—ఏదారీ లేకపోతే, నాచావు రూఢి.

మి—తొందర పడకండి, రమణగారు. చావడానికి బోలెడు సావకాశం ఉంది. చావు ఎప్పుడూ తయారుగా ఉన్నదేగా! కడం సాధనాలు ఏవీ ఫలించనప్పుడు మరణం. కాని, అటువంటప్పుడు అదీ ఫలించదు.

ర—ఏమో! నువ్వు రక్షిస్తే తప్ప నే ఉండను.

మి—సరే. నాకు ఒక ఆలోచన తట్టింది. వెడుతూ చెబుతాన్లెండి, రండి. (అని కు. మ. కి పోతారు.)

[ఎ. మ. నించి చంద్రం నీలాలూ వస్తారు]

చం—ఏం నీలాలూ? ఏమైంది? మళ్ళీ పొమ్మందా?

నీ—ఏ రాయబార్నీ ఇంత తేలిగ్గా పంపించేసి ఉండరండీ! ఒక్క క్షణంపాటు ఆవిడతో తమరు సంభాషించకోరుతున్నా రని నేను ఇల్లా చెప్పానో లేదో. అపళంగా.

ఆవిడ ఫెడీమని, 'వెళ్ళు వెళ్ళు! చెబుతున్నాను! నాకు నువ్వంటే ఎంత లెఖ్ఖలేదో మీా యజమా నన్నా అంతే. ఈ పాటికి అతణ్ణి సడవమను!' అంది. అంటూనే గిఱుక్కున తిరిగి వెళ్ళిపోయింది. మిరియం అంతే. ముఖం పక్కకి తిప్పి, టెక్కించి, 'ఛీ, పో, చవటా!' అంది నన్ను. మనిద్దరి పనీ ఒకటే మోస్తరుగా ఉంది లెండి. మనం ఆట్టే పొంగిపో నక్కర్లేదు.

చం—చూశావా ఎంత కృతఘ్నులో! నా ప్రేమ ఎంత ఉత్కృష్టమైన రకం? ఆ విషయంలో నేనుదగా పడుతున్నా నేమో అని, మొదట్లో నేను అనుమానించాను, కోపించాను. నా కోపం న్యాయం అయిన కోపం, నా శత్రువు జయిస్తూంటే నేను కోపించడం తప్పా? కోపం లేకుండా అప్పుడుకుడా కొయ్యలా ఊరుకోనా? పోనీ, ఆ సందర్భంలో ఏ దౌర్భాగ్యుడు కోపించకుండా ఉండగలడు చెప్పూ. అక్కడికీ, ఆ కోపంతో నేను అల్లానే ఉండి పోయానా? వెంటనే పశ్చాత్తాప పడ్డానుగా! లీల నన్ను మళ్ళీ యథా ప్రకారం మన్నించద్దూ? పోనీలే! నేను మాత్రం లీలకి తగ్గ శాస్తి చెయ్యలేనా ఏమిటీ?

నీ—నేనూ అంతేనండి. మనిద్దరం కూడా ప్రేమని దూరంగా పారేసి, కోపం వహింతాం పట్టండి! ఇంత చాంచల్యం కూడదని ఈ ఆడవాళ్ళకి ఓ సారి గట్టిగా బుద్ధిచెప్పి, మనలో ఇంకా రోషం చావనట్టు దాఖలా చూపెట్టాలండీ!

ముందు మనం మనల్ని మన్నించుకుంటే తప్ప ఈ ఆడవాళ్ళు పెద్ద పెద్ద కబుర్లు మానరు. పురుషుడు తన మనస్సు ఎంత పట్టుగో లేకపోతే, స్త్రీ అతణ్ణి అంత నీచంగా కడుతుంది.

చం—అబ్బే! ఇక సంశయమేమిటి! ఈ యీసడింపులు నాకు చాలా అసహ్యం కలిగించాయి. నేను మరోసంబంధం చూసుకుంటాను.

నీ—చిత్తం. కాని నేను మరో సంబంధం చూసుకోను. బ్రహ్మచర్యంలో ఉండి పోతాను. వెనక ఓ గొప్పవాడు అన్నాడండి, 'స్త్రీమనస్సు సముద్రం' అని. నిజం, పురుషుడి మీద స్త్రీకి కోపం రేగిందంటే, నడి సముద్రంలో పడవ ఉండగా తుపాను రేగినట్టే!

చం—బాగా అన్నావ్!

నీ—చిత్తం. కాని, (అని కు. ఎ. కి చూసి) వాళ్ళు ఇల్లా వస్తున్నారండి. ప్రణయ ప్రళయం ప్రదర్శించాలి. మీరు నిబ్బరంగా ఉండాలి, మెత్తపడిపో కూడదు.

చం—అల్లాంటి భయం ఎప్పుడూవద్దు.

నీ—ఏమోనండి. ఆవిడ ఇటు చూసే సరికి మీ రేమవుతారో!

(కు. ఎ. నించి మొదట మిరియం కొంచెం ఇవతలకి వస్తుంది. తరవాత లీలవచ్చి పక్కనే నిలబడుతుంది).

మి—అడుగో ఆయన అక్కడే ఉన్నాడు. మీరు ఇంతా చేసి మెత్తపడి పోకుండడు.

లీ—నాకు ధైర్యం లేదనే!

మి—ఇల్లా వస్తున్నారు,

చం—భయంలేదు, భయంలేదు. నా ప్రేమ దస్తరం విప్పడానికి నే రాలేదు. అదంతా వెనక. స్వల్పప్రమాదానికి నువ్వు ఆగ్రహం పూనావు, పెంచావు, నన్ను తిరస్కరించావు, తిరస్కరణవల్ల ఎంత ఉదారమైన హృదయం కూడా ఖేదిస్తుంది. అసలుమాట, నువ్వు నన్ను ఆకర్షించినంతగా ఎవరూనన్ను ఆకర్షించలేదు. నా ప్రేమ అపారంగా ఉండేది. నాఆత్మనిన్ను ఆరాధించేది. ఇప్పుడైనా విడిపోవడం నా కెంత కష్టంగా ఉందో! ఇక నా హృదయం సర్దుకుంటుందో లేదో, మళ్ళీ అసలు ప్రేమించగలదో లేదో చెప్పలేం! మరి నిన్ను బాధించను, ఇదే ఆఖరుసారి.

లీ—ఈ సారి కూడా లేకపోతేనే తీరిపోను!

చం—సరే. నీతో పరిచయమే మానుకుంటాను. చచ్చేనా పోతాను గాని, నీతో మరి మాట్లాడను.

లీ—నమస్కారం.

చం—నామాట నిజం. నా మనస్సులో నువ్వు ఉండి తీరతావులే! అయినాసరే నీ దగ్గిరికి మళ్ళీ రాను.

లీ—వచ్చినా వ్యర్థం!

చం—ఇల్లా నువ్వు తరిమేస్తూంటే మళ్ళీ వస్తానా, నూరుసార్లు ఆత్మహత్య చేసుగుంటానుగాని!

లీ—అందుకనే, ఆ ప్రసంగం మరివద్దు.

చం—అవును. ఆ ప్రమేయమే వద్దు. ఆ విషయంలో నీకు నచ్చే దాఖలా కనబరిచి మరీ వెడతాను. నిన్ను జ్ఞాపకం చేసేది నా దగ్గిర ఏమీా కూడదు. ఇదుగో నీఫొటో, పుచ్చేసుకో. అది నీకంటె నయం. అది నీకు మల్లేనే ఉంది కాని, నీ వెంకితనం దానికి లేదు.

నీ—పోతే పోయింది గాని, మా బాగా అనేశారండీ!

లీ—ఇదుగో వద్దంటూంటే మీా రిచ్చిన రవ్వ!

మి—మా బాగా చేశారండీ!

చం—(ఉత్తరం తీసి చదువుతాడు) "ప్రాణప్రియా! మీా ప్రేమ నాపై అపారమనిన్నీ, తమపై నాప్రేమ ఎట్టిదో కదా అనిన్నీ మీారు వ్రాశారు. మీారు నన్ను ప్రేమించి నంతగా, మిమ్ము నేను ప్రేమించ జాలకపోయినా, నేను ఎంత ప్రేమకు నోచుకున్నానో కదా అనే భావాన్ని ప్రేమిస్తున్నాను. విధేయురాలు—లీల" ఇది దగాకోర్ ఉత్తరం. ఇదీ దీనికి శాస్తి...(అని ఆ ఉత్తరం చింపేస్తాడు.)

లీ—(ఒక ఉత్తరం తీసి చదువుతుంది) "నా దారుణ ప్రేమగతి ఏమిటో, నన్నెంతకాలం ఇట్లా దహిస్తుందో, ఎరగను. కాని, సర్వసుందరీ! ఎల్లకాలమూా నిన్నే ప్రేమిస్తాను. విధేయుడు—చంద్రం." ఇది మీారు వ్రాసింది. ఈ ఉత్తరమూా, ఇది రాసినవారూా కూడా దగా. (అని, ఆ ఉత్తరం చింపేస్తుంది)

చం—(ఇంకో ఉత్తరం తీసి) ఇదీ నీ దగ్గిర్నించి వచ్చిందే. ఆ కారణం చాలు. దీనిగతీ అంతే.

మి—(లీలతో) ధైర్యంగా ఉండండి.

లీ—(ఇంకో ఉత్తరం తీసి చింపుతూ) నేనూ అంతే చేస్తాను. మీ దగ్గిర్నించి వచ్చిన ఉత్తరం ఒక్కటేనా ఉంచను.

నీ—(చంద్రంతో) చివరమాట మనమే అనాలండోయ్. జాగ్రత్త.

మి—(లీలతో) నిబ్బరంగా ఉండండి.

లీ—ఇదుగో మీ ఉత్తరాలన్నీ చింపేశా !

చం—సరే. ఈ సమావేశం ఆఖరు. సెలవ్.

లీ—సెలవ్.

మి —(లీలతో) అంతేకావలిసింది. మా బాగా అయింది.

నీ—(చంద్రంతో) మీరే నెగ్గారు.

మి—(లీలతో) మరి పోదాం రండి.

నీ—(చంద్రంతో) ఇంత ధైర్యం కనపరిచాం గనక, రండి.

మి—(లీలతో) ఆగిపోయారేం ?

నీ—(చంద్రంతో) ఆగిపోయారేం ?

చం—లీలా, లీలా ! నావంటి మనస్సు నీకు మళ్ళీ దొరక్క పరితపిస్తావున్నీ !

లీ—చంద్రంగారి మనస్సు లాంటి మనస్సులు లక్షా తొంభై ఉండకపోవున్నీ ! మీరు నన్ను నిజంగా ప్రేమించండే !

చం—నువ్వు నన్ను అసలు ప్రేమించావే!

లీ—ఓ పనిచేస్తే బాగుండేది...అదంతా ఎందుకులెండి ఎవరిదారి వారి దయేటప్పుడు!

చం—అంతే?

లీ—అవును. అది యిందాకానే స్థిరపడిందిగా!

చం—ఆమాట అంత లీలగా మాట్లాడతావేం, లీలా?

లీ—మీ మోస్తరుగా ఉండడానికే.

చం—నా మోస్తరుగానా?

లీ—అవును. మనం ఎవర్నైనా వదులుకునేటప్పుడు దుఃఖిస్తున్నాం అని వాళ్ళకి తెలియనియ్యకూడదు.

చం—దుష్టురాలా! నువ్వే వదులుకోవాలని కోరతా!

లీ—నేనా? మీరే!

చం—నే నీకు ఆనందం కలిగించడానికే ఇందాక ణ్ణించీ, యత్నం!

లీ—మీ ఆనందంకోసమే గావును.

చం—నేను పశ్చాత్తాప పడ్డానుగా!

లీ—వద్దండి! అల్లాంటప్పుడు క్షమించకుండా ఉండలేను, నేను.

చం—అయితే నన్ను క్షమించి, ఎప్పట్లా నన్ను కటాక్షించు.

లీ—అబ్బ! మీ యిష్టం అండీ!

(లీల సిగ్గుతో కుడిమధ్యకి నిష్క్రమించగా, చంద్రం కూడా అటు సంతోషంగా పోతాడు)

మి—పాపం ! లీలగారికి ఎంత పామరత్వమో !

నీ—ఛీ ! నాకు కోపం వస్తోంది. నేనుకూడా నిన్ను క్షమించమంటాననుకున్నావా ?

మి—క్షమాపణ కోరకుండా, నీ అందానికి నిన్ను నేను మోహిస్తాననుకున్నావా ?

నీ—అయితే కాస్కో. లేసుతో రుమాలు అల్లి ఇచ్చావ్. నా కర్కర్లేదు తీస్కో.

మి—ఇవుగో, పుచ్చేసుగో, 'పిన్నులు' కొని ఇచ్చావ్ !

నీ—ఇదుగో, వెనక నాకు చాకు బహుమతీ ఇచ్చావు. అప్పుడు అది అణాఅయిఉంటుంది, తీస్కో.

మి—ఇదిగో నీ కత్తెర. నువ్వురాసిన ఉత్తరాలు ఇక్కడ లేవు. అన్నీ తగలేస్తాలే.

నీ—నేనూ అంతే చేస్తాలే.

మి—మరెప్పుడూ ప్రేమభిక్ష అడక్కు.

నీ—ఇదుగో దారపుపోచ, మన అనుబంధం తెంపేసుకోడానికి, ఈ సూత్రం తెంపుదాం పట్టు. దీంతో, వ్యాపారం పైసలు—అదుగో, తమాషాగా చూడకు. నాకు కోపం పోతుంది మళ్ళీను.

మి—నన్ను నవ్వించడానికి యత్నించకు, లాభంలేదు.

నీ—అయితే, రామరీ ! అదుగో ! నవ్వుతావేం, సిగ్గులేదూ ?

మి—నువ్వే నవ్విస్తూంటా!

నీ—ఓసి నీనవ్వు నష్టంగానూ! నాకోపం అంతా పోగొట్టావే! ఏమంటావ్? సూత్రం తెంపుతావా?

మి—మీ యిష్టం!

నీ—నీయిష్టం!

మి—అబ్బే! మీ యిష్టమే.

నీ—నిన్నెప్పుడూ ప్రేమించద్దూ!

మి—మీ యిష్టం.

నీ—నీమాట చెబుదూ!

మి—నేనేమీ అనను.

నీ—నేనూ అనను.

మి—నేనూ అనను.

నీ—సరే. నన్ను క్షమించు.

మి—మిమ్మల్ని క్షమించాను.

నీ—ఆహా! నీఅందం నన్ను మంత్రించింది!

మి—ఆహా! మీ దగ్గిర నేను వెర్రిదాన్ని!

(సిగ్గుతో మిరియం కుడి ఎకరకి నడవగా గంతులేస్తూ నీలాలు వెనకాలే వెళ్ళాలి.)

(తెర)

—

## రంగం-5

[కు. ఎ. నించి ముందుగా పంకజం వెనకాలే ఉసూరుమంటూ శానయ్యా వస్తారు]

శా—అయితే, మనం, లీలగారి ఇంటోకి వెళ్ళితీరా లంటారా ?

పం—లేకపోతే నేను బతకను.

శా—రహస్యంగా వెళ్ళద్దూ ?

పం—అవును.

శా—నావల్ల అల్లరి జరుగుతుందేమో అని భయంగా ఉంది.

పం—ఏం ?

శా—నేను దగ్గుతో ఛస్తున్నానండి. (అని దగ్గుతాడు) చూశారా, ఎంత తీవ్రంగా ఉందో !

పం—ఫర్వాలేదు. ఒక్ఖమిరియం నోట్లో వేసుగుందుగాని!

శా—అది మాత్రం వీలా బాబూ! సరేగానండి, చంద్రంగారూ, అంబయ్యగారూ, నన్ను చావగొట్టాలని చూస్తున్నారట. వాళ్ళు బాగా తయారై చాలా జనం ఉంటే ?

పం—ఉంటే ఏం ? మనం పోట్లాడి కుమ్మేసేద్దాం.

శా—మనమా ? నేనా ? కుమ్మెయ్యడానికి. ఇదేం భోదనంటండీ ! అక్కడ అన్నారా నేను వలుగురిపెట్టు.

పం—ఛీ. నోరుముయ్. నాకు పిరికిమందు వేస్తున్నావ్.

శా—నాకు మెలుకువలోనూ నిద్రంలోనూ కూడా కర్రలూ ఉరితాళ్ళూ కత్తులూ కనిపిస్తున్నాయి. ఉండండి. (అని ఎ. మ. కి చూసి) వస్తున్నానండి. (అని వెళ్ళి అప్పుడే ఏడుస్తూ వెనక్కి వస్తాడు)

పం—ఏం ?

శా—మరండీ! అక్కడ చెప్పుకుంటున్నారండీ, చంద్రం గారూ అంబయ్యగారూ కలిసి నన్ను ఒళ్ళుపట్టి నన్నికొట్టి, నా ఎముకలు పొడుంచేసి రవాణా చేస్తారటండి.

పం—చంద్రమూ! ఆఁ! ఏడిశాడుపోదూ! మన్నికొట్టడం మాటలు చెప్పినట్టే !

శా—మని కోసం వెతుకున్నార్టండి, మనం దాక్కోడం మంచిదిట.

పం—ఓరి భడవా! నీ అంత పిరికివాణ్ణి నేను కూడా అవాలనా ?

శా—ప్రాణాలు తీసి కాపుటండీ, స్వామీ! ఓమాటేగా పోయేది !

పం—మరి మాట్టాడావంటే మాట కింద కొట్టేస్తాను. చచ్చినట్టు, రా !

[అని, ప. మ. కి పంగణం నడవగా, భయంతో శానయ్య వెనకాలే వెళతాడు. ప. మ. నించి రమణా, మిరియం వస్తారు.]

ర—ఇదంతా నిజమే ! మళ్ళీ చెప్పు, మళ్ళీ చెప్పూ !

మి—నేను తిన్నగా వెళ్ళి ఆ పూలమ్మిని కలుసుకున్నాను. అదీ నేనూ కలిసి మీ నాన్న దగ్గిరికి వెళ్ళి సంగతి యావత్తూ చెప్పేశాం. అక్కణించి కాస్తధైర్యం చిక్కి తిన్నగా కూర్మయ్యగార్ని కలుసుకుని నిమ్మళంగా, మాట జారేసి, ఆయన చేత ఒప్పించాం. ఈ పెళ్ళి తక్షణం జరపాలని మీ నాన్నకంటె కూర్మయ్యకి ఎక్కువ ఆదుర్దా పట్టుగునేట్టు చేశాం.

ర—ఆహా! మిరియమ్మా! ఇదంతా నీ నేర్పు గదా!

మి—పైగా, కూర్మయ్యగారు ఇంకా ఏదో తమాషా చేస్తాడట, ఎవ్వరితోటీ ఈ మాట చెప్పద్దన్నారు.

(క. ఎ. నించి కూర్మయ్య వస్తాడు)

కూ—రావమ్మా! అమ్మాయి! నాకు తెలిసిందిలే! నువ్వు ఇంత పదిలంగా వ్యవహరించావ్ గనక, నిన్ను నేను క్షమించాను. మా వాడూ చివరకి సంతోషిస్తాడు. వాడిల్లా వస్తున్నాడులే. మీ వాళ్ళని నువ్వెళ్ళి తీసుకురా.

ర—చిత్తం. విధేయురాల్ని.

(అని, ఎ. ఎ. కి నిష్క్రమిస్తుంది. మిరియంకూడా పోతుంది.
క. మ. నించి,పంకజం శానయ్యా వస్తారు)

కూ—ఎవరు వారూ! పంకజం! రా, రా! ఇప్పుడు నీకూ ఒక మనిషికీ గొప్ప కలహం జరగాలి. శత్రువు అసాధారణపు మనిషి.

శా—గొంతికలు తెగ్గోసుకుంటూంటే ఎవ్వరూ అడ్డ పడరూ? సరేలెండి. ఏదేనా అఘాయిత్యం జరిగితే, నా పూచీలేదు.

కూ—ఈ విషయంలో నేను మా వాడికి హుషారీ యిస్తాను.

శా—ఎక్కడ తండ్రివి దొరికావయ్యా!

పం—నాయ్నా! నీ మాట నాకు నచ్చింది. నీ మనస్సు కష్టపెట్టాను అపరాధం నాది. నీ సమ్మతి నేను పుచ్చుకో లేదు. ఇప్పుడు ఆ చంద్రాన్ని ఎదురుకోమని గావును నీ మాటలో అభిప్రాయం!

కూ—మొదట నేను అల్లానే అనుకున్నాను. కాని, ఇప్పుడు అంతకంటె గొప్ప శత్రువే నీకు ఎదురు కాబో తూంటా!

శా—రాజీ కుదరనట్టే!

పం—అయితేమాత్రం! నే పారిపోతానా! ఛీ!...ఈ కొత్త శత్రువు ఎవరు?

కూ—రమణ!

పం—రమణా!

కూ—ఇప్పుడొస్తాడుగా, చూస్తుగాని,

పం—నా ప్రేమవ్యాపారంలో కృషి చేస్తానని మాట యిచ్చాడే!

కూ—అతడే. ఇప్పుడు నీమీద కక్ష స్వయంగా తీర్చు కుంటాడు. నువ్వు వెర్రిమాట పుట్టించావుట. అందుకని, ప్రమాణకి నువ్వు సమాధానం చెప్పితీరాలట. ఆలస్యం కాకూడ దట.

పం—అయితే, నాన్నా! లీలకూడా...

కూ—అన్నట్టు, లీల, చంద్రాన్ని, ఇప్పుడే పెళ్ళాడ బోతోంది. నీమాట కల్ల అని ఋజువుచెయ్యడానికి, నిన్ను ప్రత్యక్షసాక్షిగా పెట్టుగుని మరీ పెళ్ళాడుతుందిట.

పం—అయ్యో! ఎంతదారుణం! లీలకి బుద్ధి, విశ్వాసం, మనస్సూ, మర్యాదా, సకలం నశించినట్టున్నాయి!

[ఎ, మ. నించి అంబయ్యా, చంద్రం, లీలా, వస్తారు]

అం—సరి. మా వస్తాద్ తయార్. నువ్వు తయారు అయినట్టేనా?

పం—ఓ. మీ రంతా దెబ్బలాడితేగాని వీల్లేదంటున్నారు గనక, నేను సిద్ధం. కొంత ఆలస్యం చేశానూ అంటే, కొంచెం మంచితనానికి పోయి చేశానుగాని, మీ వస్తాద్‌కి జంకికాదు, ఇప్పుడిక మర్యాద నడిచింది. ఎందుకేనా మరి

సిద్ధమే. నేను అంత పాపం కట్టుకున్నాను గనక, దాని అంతం చూడవలసిందే. (లీలతో) ఇంకా నిన్ను ప్రేమిస్తు న్నాను అనుకోకు. నా మనస్సు యావత్తూ ప్రస్తుతం అగ్ని హోత్రం. నీ మర్యాద తెలిసిపోయిం తరవాత, నీ తప్పుడు పెళ్ళికి నేను ఏడుస్తూ కూచోను. లీలా, నీ ప్రవర్తన అస హ్యంగా ఉంది. నీకు ఏమంత్రైనా సిగ్గులేదే!

లీ—అంతంత మాటలకి నేను క్షోభించవలసిందేగాని, తొందరపడను. నా తరఫున రమణని రానిస్తూ, అవుతుంది నీకు మంగళం!

[ఏ. మ. నించి రమణా. మిరియం, నీలాలూ వస్తారు]

పం—రమణేకాదు, అతనితోమరి పాతికమంది వచ్చినా సరే, నేను జడవను. పాపం! తండ్రిగారు చేసిన తప్పుకోసం ఇప్పుడు రమణ ప్రాణం ధారపోస్తున్నాడు. నన్ను కాసుగో మన్నాడు గనక, అతనికితగ్గ సమాధానం చెప్పి తీరతాను, నువ్వుకూడా రావయ్యా! చంద్రం!

చం—ఇటీవలదాకా నాకూ దెబ్బలాట సరదాగానే ఉండేది. అయితేం, ఇప్పుడు రమణే సంగతి యావత్తూ పైసలు చేస్తానంటే, నే నాగిపోయాను.

ప—అవును. నీ జాగ్రత్తమీద నువ్వున్నావ్!

చం—నీకు రమణ చాలు!

పం—రమణా!

కూ—ఏం! రమణంటే వేళాకోళం అనుకుంటున్నావా యేమిటి? అబ్బో! ఎంత అసాధ్యపు మనిషో నువ్వోయ్ గరవ్!

అం—మరే, ఇప్పుడు కనపడుతుందిగా, రమణ సంగతీ!

పం—అయితే, రమ్మనండి.

మి—ఇదేమిటే, ఇంతమందిలో!

సీ—అవును, భావ్యం కాదు.

పం—మీరు నవ్వుతున్నారా, నా కేసి చూసీ! ఈ మాటు నవ్వినవాళ్ళ బుర్ర ఎగరగల్దు. రమణా! రా!

ర—అబ్బెబ్బె! వాళ్ళు చెబుతూన్నంత భయంకరత్వం నాలో లేదు. ఇంతవరకు ఎప్పుడైతే వచ్చిందో, అబలత్వం నాదే అని తెలుతుంది. మిమ్మల్ని ఎదిరించే ధైర్యం నాకు లేదు. లీల సోదరుణ్ణి మీరే జయించారు. మీరు నన్ను చంపినా, నా కిష్టమే. కాని ఆ మృత్యువు వల్ల, మీకు తప్ప ఇతరులకు చెందని స్త్రీని, మీ భార్యగా చేసుకున్నట్టే?

పం—ఛీ! ప్రపంచం అంతా ఆమె దుష్ప్రవర్తన గ్రహించారు.

ర—పంకజంగారూ! మిమ్మల్ని ప్రేమించిన స్త్రీ పావనమైనదని మీరు గ్రహించండి. ఆమె ప్రేమ నిష్కళంకం. ఆమె ప్రేమ నిశ్చలం. మీ తండ్రిగారు సాక్షి.

కూ—నాయనా! నిజం, నిజం. నీ కోపం చూసి, మేం, చాలా నవ్వుకుంటున్నాం. ఇక నీకు చెప్పెయ్యాలి. నిన్ను ప్రేమించిన స్త్రీ నీ ఎదురుగుండానే మొగవేషంలో ఉంది. కొన్ని కారణాలవల్ల ఆ పిల్ల ఇట్లా పెరిగింది. నేటివరకూ మేం ఎవ్వరమూ ఎరగం. లీలని నువ్వు ప్రేమించి చెప్పిన మాటలన్నీ ఆ పిల్లే పుచ్చుగుంది. రమణని ఇక నువ్వు పెళ్ళి చేసుగోడమే మిగులు.

అం—నువ్వు చేసిన అపరాధానికి, నీకు ప్రోత్సాహం యిచ్చి, మేం జరపదలచిన కయ్యం ఇదే!

పం—చాలా విచిత్రంగా ఉందే! ఏమి ఆశ్చర్యం! ఏమి ఆనందం! ఆ కళ్ళే నన్ను మోసగించిందీ!

అం—రమణా! ఇక పెళ్ళి వేషం మార్చుగో!

పం—లీలా, నన్ను క్షమించు

లీ—ఫర్వా లేదు.

అం—ఇంట్లోకి పదండి. తీరుబడిగా చెప్పుకుందాం!

చం—మా వ్యాపారాలు సరి. అయినా సరే, దెబ్బలాట తప్పనట్టు కనిపిస్తుంది. మిరియం మాటేమిటి, నీలాలా, శానయ్యా?

శా—నా కొద్దండోయ్! నీలాల్ని పెళ్ళిచేసుకోమనండి. నేను మిరియాన్ని ఎరుగుదునుగా!

మి—నేను నిన్ను భర్తగా ఎన్నుకుంటాననా! నీ లతు

శా——నీలాలూ! నిన్ను పెళ్ళాడి, మిరియం, నీతోటే ఉంటుందనా!

నీ——మహారాణిలాగ! నా దగ్గిర పడిలిపోతుంది. లేక పోతే, ఎరగదూ!

శా——ఇల్లానే అని, పదపడి అనేకమంది జోరు తగ్గారు, ఎక్కడికి లే!

అం——అబ్బా! చాలోయ్. ఊరుకోండి. పోదాం పదండి, కబుర్లకేంలోటూ! కావలసినంత సావకాశం. దెబ్బలాటలు పెళ్ళిళ్లుగా మారితే మరి కావలిసిందేమిటి?

(తెర)

---

# నిజంకూడా అబద్ధమే!

## పాత్రలు

సంతానం—(ధనికుడు, అలారం యొక్క భర్త)

శ్రావణం—(మోతుపరి, అలారం తండ్రి)

జీవన్—(చదువుకున్నవాడు, ఉద్యోగి)

మహాదేవయ్య—(జీవన్‌కి పరిచితుడు, గడసర్ని అనుకునే వాడు)

అలారం—(శ్రావణం కూతురు, సంతానానికి భార్య)

వెన్న—(అలారానికి దాసి)

## రంగం—వచ్చే పాత్రలు

1—సం, మ. శ్రా, జీ, అ, వె

2—వె, మ, సం, అ, జీ, శ్రా

3—జీ, మ, అ, సం, వె, శ్రా

## పాత్ర—వచ్చే రంగాలు

సం—1, 2, 3

శ్రా—1, 2, 3

జీ—1, 2, 3

మ—1, 2, 3

అ—1, 2, 3

పె—1, 2, 3

## రంగం-1

[సంతానం ఇంటి యెదటిస్థలం. రంగానికి కుడివేపుఇల్లు, ఎడమవైపువీధి. సంతానం తన స్థితిగతులగురించి యోచింపుతూ తపపంకిస్తూ చప్పరిస్తూ చేతులు కడుతూ విప్పుతూ తిరుగుతూ ఉంటాడు.]

సం — కోరికోరి నాతరహాకి మించినపిల్లని చేసుగున్నాను, తీరిపోయింది — పట్నవాసపు గొప్పింటిదాన్ని తెచ్చు గున్నాను, నామూచ్చటకాస్తా ముక్కలైపోయింది. నాకు మొయ్యలేనంత ధనండుంది. ఉంటేం? నాయింట్లో నాకంటె గడ్డిపరక్కే విలవెక్కువ. 'నువ్వు పల్లెటూరి బైతువిరా' నిన్నుకాదు నీఆస్తినే నేనుపెళ్లిచేసుగుంటా' అనే ధోరణిలో ఆ సుతారప్పిల్ల తెగేసి ప్రకటిస్తోంది. ఇహనెల్లా నేను ఊరెట్టుగోడం! తనభర్తగారు అనే గౌరవం నాకు ఆర్జించి పెట్టడానికి నాఐశ్వర్యం చాలదుట! నేనంటే ఆవిడికి విషం— విషమూ గన్నేరువేళ్లూనూ. నాపేరుచెబితే తనకి నామర్దాట. ఆవిడికి నా పొడగిట్టదు. (ఛాతీమీాద బాదుకుంటూ) ఒరే! తెలివిమద్దెపు సంతానమూ! ఎంతపొరబడ్డావురా, నీపొరపాటు చల్లగాఉండా! ఇల్లంటే నరకం అనిపించే పిల్లని ఎందుకు కట్టుకున్నావురా! అనుభవించమ్మా, అనుభవించు!

(కుడిమధ్యనించి మహాదేవయ్య రావడం చూసి—తనలో) ఎవడో వీడు, ధనాసరి రకం. నే లేనప్పుడు నా యింట్లోకి వెళ్ళడం ఎందుకూ నన్నడక్కుండానూ! పోనీ ఏదో వెళ్ళా

డండీ, నే నిక్కడ ఉంటూండగానే వచ్చేస్తాడేం మునిగిపోయి నట్టూ! ఇల్లాగే ఉంటాయి వెధవ తెలువులు!

మ—(తనలో) ఈ ఇంట్లోంచి నేను బయటికి రావడం విషయం వీడు నన్నడిగితే వీణ్ణి మెత్తగా మాడ్చేస్తాను. యజమాని గురించిన పనిమీదే వెళ్ళా నంటాను, కావలిస్తే యజమానిరాల్తో చెప్పగో మంటాను.

సం—అయ్యా! నమస్కారం.

మ—విధేయుణ్ణి.

సం—మీది ఈప్రాంతం కానట్టుంది.

మ—ఈ ప్రాంతం కాదు, (కుడివేపు చూపించి) ఆ ప్రాంతం! వ్యవహారపు పనిమీద వచ్చాను.

సం—మంచి మాటేగాని, ముందు ఈ ఒఖ్ఖసంగతి చెప్పండి.

మ—అడగండి.

సం—(కుడివేపు చూపిస్తూ) ఈ యింట్లోంచేనా తమరు వస్తూంటా?

మ—స్. కేక లెయ్యకండి.

సం—ఏం?

మ—అబ్బ, నిమ్మళం, ఏమిటదీ!

సం—ఏమిటి సంగతీ?

మ—(నోరుమూసుగుని సంజ్ఞ చేస్తూ) ఈ యింట్లోంచి నేను ఇవతలకి రావడం మీరు చూసిఉండకూడదు. ఒకవేళ ఏకంటో చూసిఉన్నా, చూసినట్టు చెప్పకూడదు,

సం—ఎంచేత ?

మ—ఎంచేతా ? అబ్బో, చాలాఉంది.

సం—అయినా, కాస్త చెబుదురూ !

మ—ష్. గలాటా చెయ్యకండి. ఎవరికేనా వినపడుతుంది.

సం—వినపడదులే, చెప్పండి

మ—చెప్పడానికి వీల్లేదు. ఇంటావిడతో నేను రహస్యం మాట్లాడ్డానికి వెళ్ళడమూ, ఒక ఉద్యోగి నన్ను పంపడమూ లాంటివి ఎల్లా చెప్పడం ? ఈ సంగతి ఒఖ్ఖ పిట్టకేనా తెలియకూడదు.

సం—నాకు తెలిసిందిగా !

మ—అయితేం, మీరు ఒఖ్ఖ పిట్టకారుగా !

సం—అవునయ్యోయ్ ! నేను చాలా జాగ్రత్తమీదే ఉంటాను.

మ—ఉండండి. ఇంటియజమానిగాడికి మాత్రం ఈ రహస్యం తెలియకుండా ఉండడం మజా ! అప్పుడు వాడు చూస్తూండగా గాడిద అవుతాడు.

సం—అటువంటి సమయంలో మీలాంటి గాళ్ళుదగ్గరగా ఉండకపోవడం మంచిది. సరేగాని, మీ పేరు ?

మ—మహాదేవయ్య.

సం—అల్లా చెప్పూ ! దేవయ్యకంటె గొప్పవారనే మిమ్మల్ని పంపించారు, ఎవరోగాని.

మ——ఆయనికి ఉద్యోగం, కొత్తగావచ్చారు. వెనక మాకు పరిచయం.

సం——ఆయన పేరు ?

మ——అబ్బ, నాలిక చివర ఆడుతోంది......మరి,... జీవన్.

సం——ఒక పడుచుకుర్రాడూ?...ఆ...

మ——(ఎడమమూల సూచిస్తూ) అటు చెట్లకేసి ఇంట్లో ఉన్నారు.

సం——అల్లాచెప్పూ! (తనలో) వాడు తనబసు ఆ శ్రేణిలో ఎప్పుడైతే పుచ్చుకున్నాడో, అప్పుడే నాకు గుండెల్లో రాయడింది.

మ——ఆయన చాలా మంచివాడు.

సం——ఎం చేత ?

మ——నా కళ్ళతో చూశాను. మీరూ చూడండి. ఆయన్ని చెడ్డవాడనేవాడు పశువు. మీరేమంటారూ ?

సం——మంచివాడే అంటాను. నిన్ను ఏంపని చెయ్యమని కోరాడూ ?

మ——ఆయనతో మాట్లాడ్డానికి ఈవిడకి ఇష్టం ఉందో లేదో కనుక్కురమ్మన్నాడు.

సం——కనుక్కున్నావా?

మ——ఆ. లోపల ఒకదాసీఉంది, దానిపేరు వెన్న. దాని పుణ్యమాఅని అది నా సంగతి వెంటనే గ్రహించి, ఇంటావిడ దర్శనం చెయింఛింది.

సం—(కోపంగా నవ్వుతూ) చెయించిందీ, పకిరి దాని మొహం ఈప్పా!

మ—మరోటండోయ్ (కులుకుతూ) ఆ వెన్న అందం అదేమి అందమండీ! అది నా గుండె తీసేసి నన్ను గుండె తీసినబంటుగా చేసేసింది. అది నన్ను పెళ్ళాడకపోతే, దాని ఖర్మం, నేనేంజెయ్యనూ!

సం—ఆ మాటానిజమే, పాపం, ఇంటావిడ ఏమిటంది నీతోటి?

మ—నాతోటా? మామూలుగానే అంది. ఇష్టులతో మాట్లాడం ఇష్టమేఅంది. తన ముగుడు, జంతువులాంటి వాడంది. జాగర్త అవసరమనీ, ఒడుపు కనిపెట్టి మరీ రావాలనీ చెప్పింది.

సం—(తనలో) అది ఇంకా భార్యేమిటీ, రాక్షసి.

మ—సందేహం అక్కర్లేదు. రంగం మహాజోరుగా ఉంటుంది. రహస్యం పొక్కనీకండి. నేను లోపలికెళ్ళడం, ఇంటావిడతో మాట్లాడ్డం, పైకిరావడం, మిమ్మల్ని కలియడం—యావత్తూ అబద్ధం అన్నట్టు మరిచిపొండి. సెలవ్. అంతా అబద్ధం.

(అంటూ చిరునవ్వుతో ఎడమ ఎకర్నించిపోతాడు)

—వీడు ఓ దళారీవీనుగు! వీణ్ణిమాత్రం ఏమననూ? ఛీఛీ, అధికవంశంపిల్లని చేసుగున్న ఫలితం ఇది. ఇంకా నేను గృహాయజమాన్నేమిటి? వాణ్ణైవణ్ణో చూస్తానంది,

మాట్లాడతానంది! సరే, మామగారు ఘటం ఇంకా ఉన్నాడుగా బతికే! వాడితో చెప్పేస్తాను, ఈ రాయబారం సంగతి. (ఎడమమధ్యకి చూస్తూ) అడుగో, ఆయనే వస్తు న్నాడు.

శ్రా—(ఎడమ మధ్యనించి వస్తూ) ఏమయ్యోయ్ !

సం—ఏమిటయ్యోయ్ !

శ్రా—ఎల్లానో ఉన్నావేం, అల్లుడూ!

సం—ఎల్లా ఉన్నాను, శ్రావణం?

శ్రా—అదేం పిలుపు సంతానం! నీ కంటె పెద్దవాళ్ళని 'ఏమండీ, అనాలిగాని, పేరెట్టి పిలుస్తారా?

సం—సరే, అల్లా అయితే, శ్రావణం మాత్రమేకాక ఏమండిగారూ!

శ్రా—రెండూ అక్కర్లేదు, ఎదో ఓటిచాలు. సరే. ఏమిటి నీ బాధా?

సం—జన్మబాధ. నా పెళ్ళాం.........

శ్రా—అదేమిటీ? మా అమ్మాయిని ఏదో ఊరికే 'నా పెళ్ళాం' అంటూ మాట్లాడేస్తున్నావే !

సం—ఏం, తప్పేముందీ! మీకెంత కూతురైనా, నాకు పెళ్ళాం కాదంటారా?

శ్రా—ఛీ అవేం మాటలు ఊరుకో. కాని, తక్కువ వంశంపిల్లని అనేసినట్టు మా పిల్లని అనేస్తే ఎల్లా!

సం—ఏం ? "పెళ్ళాంగారు" అనమంటారా ? మర్యాదలు అల్లా ఉంచి అసలుసంగతి వినండి. మీ పిల్లతో పెళ్ళి నాకు తృప్తికరంగా లేదు.

శ్రా—కారణం ఏమిటి అల్లుడా !

సం—నాకు లాభించ లేదు.

శ్రా—అంటే ?

సం—అంటే, మీకు లాభించిం దన్నమాట. ఆ సొమ్ముతో మీరు ఋణాలు తీర్చుకున్నారు. నాకేం ముట్టిందో తెలుసా ? ఫలానా శ్రావణంగారి కూతురైన అలారం అనే ఆవిడకి భర్త అనే పేరు.

శ్రా—ఓయి వెర్రివాడా ! మా వంశంతో సంబంధం మూలంగా నువ్వు ఎంత మోగిపోతున్నావో తెలుసా ? మా వంశం మహా ఋషుల్లోంచి సూటిగా క్రమేపీ దిగింది.

సం—నయమే. గబ గబా దిగిందికాదు, ప్రమాదం చేది.

శ్రా—మా సంపర్కంవల్ల నీ సంతానం మహా జనులవుతారు.

సం—నా సంతానం ఏమవుతారో తెలియదు గాని, పొదరాళ్ళే వ్యాపారం కట్టుదిట్టం చేసుకోకపోతే, (నుదురు బాదుకుంటూ) ఈ సంతానంగాడు ఆడారివాజన్ను అయిపోతాడు.

శ్రా—అదేం మాటలోయ్, అల్లుడూ ?

సం—ఏమాట్లాలా ? మీ అమ్మాయి భార్య ఉండవలసిన రీతిగా ఉండటంలేదు. మర్యాదకి భంగకరంగా ఉండే ప్రవర్తనలో పడింది.

శ్రా—ఏయ్, నెమ్మది నెమ్మది. తెలిసి మరీ మాట్లాడు. మాది గౌరవభంగం అంటే ఎరగని కోవ. మా కుటుంబం పతివ్రతలకి పుట్టిల్లు. ముప్ఫై తరాల్నించి మా వంశంలో వేలు మడిచిపెట్టుకున్న ఆడపడుచే లేదు.

సం—బస్. దానికేం లెండి. ఈ మాత్రం బడాయితో అడ్డమైనవాడూ మాట్లాడతాడు.

శ్రా—బడాయి కాదోయ్, వాస్తవం. మా వంశంలో ఒకావిడికి, తనతో ప్రసంగించడానికివస్తే, ఇరవైవేలిస్తానని, ఒకరాజబంధువు కబురు చెయ్యగా, ఆవిడ ఛీ పొమ్మంది.

సం—మీ అమ్మాయికి సామాన్యా ఇరవైవేలక్ఖర్లేదు, ఛీ పొమ్మనీ అనదు.

శ్రా—ఓహో హో! అల్లాయితే, వయినం ఏముటో చెప్పుమరి. ప్రతీ విషయంలోనూ మా అమ్మాయిని వెనకేసుకువస్తాననుకోకు. తప్పొంటే చప్పరించి ఊరుకోను, తగ్గశిక్ష విధిస్తాను.

సం—ఒక ఉద్యోగి ఈ దగ్గిరే ఉన్నాడు. రాయబారం పంపించాడు. ఈవిడ చిలకలాగ వింది.

శ్రా—నిజంగానే! అయితేనను. క త్తైబై తే పోడి చేస్తాను. గౌరవాలు తగులద్దు తరవాత కళేబరా లెందుకూ!

సం—నా బాధ నేను చెప్పాగున్నాను శిక్ష మీరే నిర్ణయించండి. నాకు సంజాయిషీ చెప్పించండి.

శ్రా—నీకు సంజాయిషీ వాళ్ళిద్దరూ కుడా చెప్పాలి. చెప్తారు. నే చూస్తాగా! నాకు కోపం రావాలిగాని, నేను మా పెద్దకయ్యాలీ రకాన్ని. ఎవర్నైనాసరే ముందు చీరే స్తాను తరవాత ఎండేస్తాను. కాని, నువ్వు చెప్పిన సంగతి రూఢే అంటావా?

సం—పూర్తిగా.

శ్రా—రూఢిఅయితేనే చెప్పాస్మీ. ఇల్లాంటివి గమనించడంలో పొరపాట్లుంటే, పెద్దవాళ్ళల్లో చాలా పీకలాటలు బయల్దేరి, ఫిర్యాదు చేసినవాడికే పీకలమీాది కొస్తుంది.

సం—నే చెప్పింది కేవల యథార్థం. శుద్ధసత్యం.

శ్రా—అయితే ముందు వాడి దగ్గిరికి నడు.

సం—నడవండి. (అని ఎడమమధ్యగా వెళ్ళబోయి) అడుగో వాడిల్లానే వస్తున్నాడు. యజమాని ఇంటి దగ్గిర లేడూ, మంచి సమయమూ, రా, అని రాయబారి చెప్పాడు గావును.

(ఎడమ మధ్యనించి జీవన్ వస్తాడు)

శ్రా—ఏమయ్యా, నే నెవరో తెలుసా?

జీ—నా కెల్లా తెలుస్తుందీ, అసలు ఎందుకూ తెలియడం ?

శ్రా—ఎందుకేమిటి ? నా పేరు శ్రావణం.

జీ—అని వినగలగడం నా చెవుల భాగ్యం. గొప్పవారని విన్నాను.

శ్రా—నన్ను చాలా ఎరుగుదురు. చిన్నప్పుడు నేను యుద్ధాల్లో పనిచేసి చాలా ఊళ్ళు ముట్టడించాను.

జీ—అల్లాగ్నండీ, చాలా సంతోషం. మేం అప్పుడు పుట్ట లేదు. నయమే.

శ్రా—మా పూర్వీకుల్లో ఒకాయన యుద్ధంలో చేరడానికి వీలుగా ఉండేటట్టు తన యిల్లూ పొలమూ తెగనమ్ము కోడానికి పైవారికి అర్జీ పెట్టుకోగా, పైవారు తిరుగు టపాలో అంగీకారం పంపించారుకూడానూ.

జీ—ఇది నమ్మడం నాకు చాలా యిష్టం.

శ్రా—అంతా బాగానే ఉంది కాని, మిమ్మల్ని గురించి మరోమోస్తరుగా విన్నానే ! మీరు ఒకమ్మాయి వెనకాల పరిగెడుతూంటారట ! ఆ అమ్మాయి నాకూతురే. మా అల్లుడనే బిరుదు సంపాదించుకున్నవాడు (సంతానాన్ని చూపిస్తూ) ఈయనే.

జీ—నేనా, మీ అమ్మాయి వెనకాల పరిగెడుతూంటా ?

శ్రా—అవునయ్యా, నువ్వే. ఏమిటీజబ్బు నీకూ, అని అడగాలనుకుంటూంటే నువ్వే పట్టుపడ్డావు. నువ్వే ఏం సంజాయిషీ చెబుతావో చెప్పు.

జీ—ఈ అపనింద చిత్రంగా ఉందే! ఎవడయ్యా మీాతో చెప్పినవాడూ?

శ్రా—చెప్పడానికి అన్నిందాలా అర్హతగలవాడే.

జీ—కాడండి. వాడెవడో దగుల్బాజీ అయిఉంటాడు. నా మర్యాద నాకుంది. అంత నీచత్వానికి ఒడిగడతానాండీ నేనూ! మీారు మహనీయులా! మీాకు అప్సరసలాంటి కూతురా! ఆవిడికి వీరు భర్తా! నేను ఆవిణ్ణి వెంటాడడమూ! ఎవరేనా నమ్మర్దండీ! తమ సేవకుణ్ణి. ఈ వృత్తాంతం మీాతో చెప్పినవాడు పశువు.

శ్రా—(సంతానంతో) ఇందుకేమంటావ్, అల్లుడూ?

సం—బోలెడంటాను.

జీ—సందేహంలేదండీ, మీాతో చెప్పినవాణ్ణి గాడిద అని పిలిచినా తప్పులేదు.

శ్రా—(సంతానంతో) చెప్పవేం సమాధానం?

సం—మీారే చెప్పండి.

జీ—వాడెవడో తెలిస్తే మీా యెదటే వాణ్ణి గుండకింద కొట్టేస్తాను.

శ్రా—(సంతానంతో) ఇందాకా నువ్వు చెప్పింది దాఖలాగా ఋజువుల్తో చెప్పు.

సం—అదే ఋజువూ అదే దాఖలానూ! నే చెప్పింది నిజం.

జీ—ఓహోహో, మీ॰ అల్లుడుగారేనా మీతో ఈ ఫిర్యాదు చేసుకున్నదీ!

శ్రా—మరే. ఇకనే నాతో ఈ వార్త చెప్పినవాడు.

జీ—అల్లా చెప్పండీ! వీరియందు మీ అల్లుడై ఉండడం అనే ధీరోదాత్త లక్షణం లేకుండా ఉంటే, ఈపాటికి ఈయన కున్న మిగతా పళ్ళు రాలిపోయి ఉండును.

శ్రా—ఒక్కమాటుండండి, ముఖా ముఖిని తేల్చేద్దాం. మా అమ్మాయిని రమ్మంటాను.

[అని కుడి ఎడరకి వెళ్ళి వెంటనే వస్తాడు. వెనకాలే అలారం వచ్చి ఆగుతుంది]

జీ—ఏమమ్మా! నేను మీ వెంట పడుతూంటానని మీ ముగుడుగారితో మీరు చెప్పారా?

అ—నేనా? నాకేం అవసరం?

జీ—ఏమో! ఆయన అల్లా పేచీ పెడుతున్నారండి.

అ—అయితే సరే, ఆయనే అల్లా ప్రచారం చేస్తున్నారు. గనక, అల్లానే! ఎల్లానేనా మీరు నన్ను కొంచెం ప్రేమిస్తురూ! బాబ్బాబు మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను, సలహా ఇస్తున్నాను మీకు. కానీండి. వీళ్ళంతా చూస్తారు పాపం, ఒక్కసారి నను ప్రేమించండి. అయ్యో మొహమాటమా! ప్రేమ లక్షణాలు కనపరచండీ! ఏదీ ఈలెయ్యండి, కన్నుగీటండి, నాకే తెలిసే వికారపు చేష్టలు చెయ్యండి. ప్రణయగీతాలు రాయండి. నా భర్త ఇంటిదగ్గిర లేని

సమయం చూసుకుని రండి నేను షికారు వెళ్ళేటప్పుడు మరోదార్ని వచ్చి కలియండి. సినీమాకి పదండి దగ్గిరసా చీకట్లో కూచోవచ్చు. దయచేసి, యత్నించండి.

జీ—ఆగండాగండి. అదేమిటి, అటువంటి ఉపన్యాసం ఇచ్చేస్తున్నారే! మిమ్మల్ని మీరే నూగీచేసుకుంటున్నారే! ఒకరి భార్య అయిన మిమ్మల్ని మోహించే దురాలోచన నా కున్నట్టు మీతో చెప్పింది ఎవరూ ?

అ—మరి లేకపోతే ఈ అల్ల రేమిటీ! ఈ తుట్ట నామీద పడ్డది గదా, ఏమిటి నాకు ధరి ?

జీ—ఇతరుల్ని వాకోకనియ్యండి. మనం సమావేశం అయి ఉంటే, అప్పుడు నా దుష్ప్రవర్తన ఏదేనా ఉంటే, చెప్పవలిసినవారు మీరూ!

అ—మీరు నన్ను చూడ్డానికి రాందే! వచ్చి ఉంటే మంచి స్వాగతం దొరికి ఉండేది మీకు.

జీ—నాది మరోరకం కాదు. నాగురించి భయం అనేది అక్ఖర్లేదు. గృహిణికి దుఃఖం కలిగించే ఘటం కాదునాది. మీరు గృహిణులూ మీ తండ్రిగారు సంపన్నులూ, మిమ్మల్ని మోహించడానికి యత్నం చేస్తానా ? నేను జంతువుపాటి చెయ్యానంటారా ?

శ్రా—(సంతోషంతో) చూడవోయ్, సంతానం, ఎంత నిష్కల్మషమైన సమాధానం ఇచ్చాడో అయన, ఇప్పు డేమంటావ్ !

సం—ఆఁ ఏమంటానూ! ఇదంతా అభూత కల్పన అంటాను. నేనూ కళ్ళు మూసుగుని లేను. స్మృతిమించే టప్పుడు చెప్పక తప్పదు—ఇందాకా ఈవిడ ఆయన దగ్గి ర్నించి చిన్న రాయబారం అంగీకరించింది లెండి, చిన్న... రాయబారం!

అ—నేనా! ఆయన రాయబారం అంగీకరించానా?

జీ—నేను ఆవిడికి రాయబారం పంపించానా?

అ—(ఎడమ ఎదరకి చూసి) ఒసే ఇల్లారా వెన్నా!

వె—(ఎడమ ఎదర్నించి వస్తుంది)

అ—ఏమే నిజమూ?

వె—నిజ మేమిటండీ? అంతా అబద్ధం, ఇంత అబద్ధం ఎక్కడా ఉండదు.

సం—ఛీ నోరుమూసుగో, తుంటరీ! నీ సంగతి నాకు తెలియదుటే! నువ్వేగా రాయబారిని లోపలికి ప్రవేశ పెట్టింది!

వె—ఎవరు, నేనా?

సం—అవును, నువ్వే. 'నేనాట' సంగనాచిలాగ!

వె—(ఆశ్చర్య పడుతూన్నట్టు) ఔర! ఎల్లాంటి రోజు లొచ్చాయో! దుర్జనత్వం ఎంత పండిపోయిందో! నాఅంత సత్యకాలపు దానికి ఎల్లాంటి అపనింద మీద పడిందో!

సం—మరి చాలించవే, నక్కా. నిన్ను చాలా ఒడ పోశాను. నీ దంతా నాటకం, నీ వన్నీ మాయలు.

వె—చూశారా చూశారా! ఏమండీ అమ్మగారూ, నే నెప్పుడైనా......

సం—ఒసేయ్, నువ్వు తక్షణం నోరుమూసెయ్, లేక పోతే అందరికీ సరిపడా నిన్ను తన్నేస్తాను, నీ తండ్రి గొప్ప వంశంవాడు కాడుగా!

అ—అయ్యో! ఎల్లాంటి అబద్ధం ఆడుతున్నారో! నా హృదయం చితికిపోయింది. నే భరించలేను. భర్తే ఇటువంటి మాటవెయ్యడం ఘోరం. ఆయన్ని నేను లోగడ మన్నించి ఉండడం కూడా తప్పే.

వె—యథార్థం అంతే.

అ—ఆయన్ని లక్ష్యంగా పెట్టుకోడం వల్లే నాకీపాట్లు! ఆయనే అన్నట్టు, నేను హాయిగా మరోర్నైనా ప్రేమించి ఉండవలిసింది. అప్పుడు నా దశ ఇంత పాడుగా ఉండకపోయే దేమో! క్షమించండి, పోతాను. ఈ అవస్థ దుర్భరం.

(అని కుడిఎదరికి పోతుంది. తల తిప్పుకుంటూ వెన్న ఆవిడ వెనకాలే వెళ్ళి మళ్ళీవచ్చి నిలబడుతుంది).

శ్రా—(సంతాపంతో) ఇంత సుగుణవంతురాల్ని నీ చేతులో ఉంచాం. దీనికి భర్తగా ఉండవలిసిన అర్హత నీకు లేకపోయింది కదా!

వె—మా అమ్మాయిగారు వెర్రిదిగనక ఊరుకుంది, నే నైతే ఈయన్ని రకాయించి ఉందును. అయ్యో! జీవన్ గారూ! మీరుచూస్తే లాభంలేదు, మా అమ్మాయిగారిని

ప్రేమించడం మొదలెట్టాలి. యత్నించండి. లాభిస్తుంది. ఏమీ లేనప్పుడు ఆమాట నాకు రానే వచ్చింది గనక మీకు సాయం నేను నిజంగా చేస్తాను. నమస్కారం (అని కుడివేపు పోతుంది).

శ్రా—అల్లుడూ! ఇల్లాంటిమాటలు పడవలిసిన యోగ్యత సంపాదించావు గదా! నీ సంగతి విన్న వాడల్లా నిన్ను ఛీ అంటాడు. జాగర్త. మా పిల్లని ఎల్లా ఆదరించాలో అల్లా ఆదరించు. ఇల్లాంటి ప్రమాదం మరి రానీకు.

సం—ఔర! నాకు మతి నిరభ్యంతరంగా పోయేటట్టుంది. నేను ప్రత్యక్షంగా ఎరుగున్న నిజాన్ని శుద్ధ అబద్ధంలా కన పడేట్టు చేస్తున్నారు వీళ్ళు.

జీ—(సంతానంతో) అయ్యా! నా మీద మీరు వేసిన నింద అక్రమం. మీరు మానమర్యాదల నీతి నీమాలు తెలి యని వారు కారు. నా మర్యాద నష్టంఅయింది. మీరు అప రాధం ఇప్పించాలి.

శ్రా—ఆది న్యాయం. అదే తీసుగో వలిసినచర్య. అల్లుడూ! ఈ ఘరానా మనిషికి నష్టపరిహారం ఇచ్చెయ్.

సం—(కళ్ళు మిటకరిస్తూ నోరు వెళ్ళబెట్టి) ఏమిటీ? నష్టపరిహారమా!

శ్రా—అవును, న్యాయప్రకారం అంతే. నువ్వు లేని పోని అపనింద వేశావ్.

సం—ఏడిశారు పోదురూ, వొత్తిపుణ్యానికి నెయ్యి లేదు నేను అపనింద. ఈ గూడుపుఠాణీ నాకు తెలుసు.

శ్రా—సరి సరి. నువ్వూ నీ మనస్సూ కూచుని అనుకుంటే సరిపోతుందా మరీ! నువ్వు అవునన్నదల్లా అతను కాదు పొమ్మన్నాడు. పైగా దాఖలా ఇచ్చాడు. అప్పుడు నువ్వు నోరెత్తలేక పోయావు.

సం—ఇది మరీ బాగుంది. ఎదైనా సరే, కాదుపొమ్మంటూండే వాడిసాక్ష్యం నిజమనా తమ ఉపదేశం! అయితే ఏ ఘోరమైనా చెయ్యొచ్చు, కాదు పొమ్మని తప్పించుగోవచ్చు.

శ్రా—మరి వాదించకు. నా మాటవిని, ఈయన క్షమాపణ కోరుకో.

సం—(నోరు నొక్కుగుంటూ) హవ్వ! నేనా, క్షమాపణా, వీణ్ణా!

శ్రా—ఆఁ సందేహించకు. ఇక్కడ పరాయివాళ్ళు లేరు లే.

సం—ఛీ. నేను క్షమాపణ ఛస్తే కోరుకోను.

శ్రా—(తీవ్రంగా) ఏయ్ అల్లుడూ! నాకు కోపం తెప్పించకు, నేను చెయ్యి చేసుగోవలి సొస్తుంది. నా మాట విను.

సం—(తనలో) అయ్యో నా అవస్థా!

శ్రా—ముందు తలపాగా తీసెయ్. ఆయనది గొప్ప వంశం.

సం—(పాగాతీస్తూ తనలో) పీడవంశం అంటించిరి!

శ్రా—ముందు నే నంటాను. తరవాత అదే నువ్వను.

'అయ్యా!'—ఊఁ, అను.

సం—అయ్యా!

శ్రా—'నన్ను, క్షమించాలి!'

సం—(సందేహిస్తాడు)

శ్రా—అనవేం ?

సం—నన్ను క్షమించాలి.

శ్రా—'మీరు తుంటర్లని అనుకున్నాను'

సం—మీరు తుంటర్లని అనుకున్నాను.

శ్రా—'మిమ్మల్ని ఎరక్కపోడంవల్ల'.

సం—మిమ్మల్ని ఎరక్క పోడంవల్ల.

శ్రా—'ఇప్పుడు బుద్ధి వచ్చింది. తమ సేవకుణ్ణి!.

సం—నాకు బుద్ధి ఇప్పుడు రావడం ఏం కర్మం, పెళ్ళి చేసుగున్న వెంటనే వచ్చింది. నాకు దగాచేసిన వాడికి నేను సేవకుణ్ణా!

శ్రా—క్షమాపణ సమగ్రంగా సశాస్త్రీయంగా ఉండాలి. అంటావా, మా వంశమర్యాద చూపించనా ?

సం—(నోరు నొక్కుగుంటూ) ఇప్పుడు బుద్ధి ప్రత్యక్షంగా వచ్చింది. తమ సేవకుణ్ణి.

జీ—(సంతోషంతో) అయ్యా, ఇక నేను తమవాణ్ణి. ఇదంతా జరగనట్లే.

(శ్రావణంతో) అయ్యా! వందనాలు, చాలా శ్రమ యిచ్చాను.

శ్రా—మీకు ఆశీర్వచనాలు. మళ్ళీ కలుసుకుందాం.

జీ—మీదయ. (అని ఎడమ ఎదరకి నిష్క్రమిస్తాడు)

శ్రా—అల్లుడూ! వ్యవహారాలు ఇల్లా చక్కపెట్టుకోవాలి. జాగర్తగా ఉంటూండు. గొప్పవంశంతో నీకు సంబంధం ఏర్పడింది. నే ఉన్నాగా! నీమీద ఈగ వాల నియ్యను. (అని ఎడమ మధ్యకి పోతాడు)

సం—(శ్రావణం వెళ్ళినవేపు చూస్తూ) ఓరి, ముసిలి మామగారు శనికుంకా! ఎల్లా వచ్చాయిరా నీకీ వేళ్ళు! నీ రాజీ మండా, వాడు నాకు క్షమాపణ పోయి నాచేతుట్రా వాడికి క్షమాపణ ఇప్పించడం? సరేలే. నీరోగం నే కుదురుస్తాలే. ఇంతకంటె వ్యాపారం ముదిరిం తరవాత నిన్ను పిలుస్తాను, ఆ దృశ్యం చూసి చస్తుగాని! దిక్కుమాలాడా!

(అని, అసహ్యం వేసే ముఖం పెట్టి, కుడి మధ్యకి వెళ్ళిపోతాడు)

(తెర)

---

## రంగం-2

[రెండో తెర ఎదట—ఎడమ ఎదరనించి వెన్న వచ్చి, కుడి ఎదర చూసి వెనక్కి వచ్చి, ఎడమకి చేత్తో సంజ్ఞచేస్తూ]

వె—రా.

మ—(ఎడమ ఎదర్నించి వచ్చి, దిక్కులు చూసి, ఒక చీటీతీసి, వెన్న చేతికి అందిస్తూ) తీరుబడేనా ?

వె—ఓ. నీకు తప్పులు చెయ్యడానికీ, నాకు వినడానికీ.

మ—నా తప్పు లేమిటీ ?

వె—ఆ సంగతి నువ్వే ఎవడి దగ్గిరో ఊదేశావు. వాడెళ్ళి యజమానిగారి చెవికొరికాడు.

మ—అబ్బే ! ఒకడు నా రాకపోకలు ఆరా తీస్తూంటే, వాణ్ణి గుట్టుగా ఉండమని ప్రాధేయపడ్డాను, వాడు పేలుడు కాయ గావును.

వె—ఆ ఉద్యోగి ఎవరోగాని, వెతిగి వెతిగి అచ్చాడీ లాంటి రాయబార్ని వెతిగాడు. ఇల్లాంటి వాళ్ళు రాయబార్లైతే, వేరే అడగక్కర్లేదు.

మ—ఇక్కణ్ణించి నే నెంత రహస్యంగా ఉంటానో చూద్దూ !

వె—ఇప్పు డెందుకూ, చెయ్యికాలిం తరవాతా ?

మ—సరేలే, ఆడస్త్రం కట్టెయ్, ఇల్లా విను.

వె—చెప్పు.

మ—మొహాం ఒక్షరవ్వ యిల్లా తిప్పు.

వె—తిప్పాను. చెప్పు.

మ—(సంతోషంతో) వెన్నా !

వె—ఏమిటీ ?

మ—(సిగ్గు అభినయిస్తూ) ఒస్. నీకు తెలియదా ఏమిటి !

వె—తెలియదు.

మ—నిన్ను ప్రేమిస్తున్నాను.

వె—అల్లాగా !

మ—నన్ను చంపుగున్నట్టు, నిజం.

వె—అయితే బాగానే ఉంది.

మ—నిన్ను చూస్తూన్నప్పుడు నేను లేనట్టు నాకు తోస్తోంది.

వె—నువ్వు లేనప్పుడు నీకు తోచడం మాత్రం ఎల్లా ?

మ—సరేగాని, నువ్వు నాకళ్ళకి ఇంత అందంగా ఎల్లా కనపడ గలుగుతున్నావూ అంటా ?

వె—నీ కళ్ళనే అడుగు. ఉన్నాయంగా.

మ—సరే. చాంతాడంత వ్యాఖ్యానం ఎందుకుగనక ! నీకు ఒప్పందం అయితే నువ్వు నాకు భార్యవే కాకుండా నీకు నేను భర్తనికుడాఅయే పెళ్ళి ఏర్పాట్లు చేద్దాం. పెళ్ళి తరవాత కుడా భార్యా భర్తలలాగే ఉందాం. ఏం ?

వె—ఎమో ! మా యజమానిగార్నిలాగే నిన్ను అను మానపు పాం కరిస్తే !

మ—చ ఛ, కరవ నియ్యను.

వె—నేను పదిమంది పురుషులమధ్య ఉన్నానరే, నన్ను నమ్మగలవాడే నా భర్త.

మ—పదిమందేమిటి, పాతికమందిమధ్య ఉన్నానరే నేను నమ్ముతాను. నాకేమిటిమధ్య!

వె—అయితే చూద్దాం.

మ—అయితే దగ్గిరికి జరుగు.

వె—వెడతావా ఏమన్నా కావాలా?

మ—డబ్బులేనివాళ్లమీాద ఏమిటా ధూకుడూ! జనాన్ని ఏమిటా పొమ్మనడం! అందంగా ఉండడమూానూ, ఒక్క ముద్దు పారెయ్యమంటే వాడన్లున్నూ. ఎవరికేనా కాస్త సిగ్గుండాలి, తోచాలి.

వె—దవడపళ్ళు షికారుకావాలా, వెడతావా?

మ—ఏమిటా దుష్టుమాటలూ?

వె—నువ్వు హద్దుమీారుతున్నావు.

మ—నామాాట కాస్తవింటే నీకొంప ఏం మునుగుతుందీ!

వె—నీకంత తొందరకూడదు.

మ—కోరింది చిన్న ముద్దు బదులియ్యమని. కావాలంటే పెళ్ళి తరవాత ఆముద్దు వాపసుచేసేస్తాను.

వె—క్షమించాలి ఇయ్యను.

మ—దేహి అంటున్నాను, వెన్నా! ఒక్కముద్దు నీ చిత్తాని ఖర్చురాసి నా మొహాన్ని పారెయ్!

వె—అమ్మగారికి చీటీ యిస్తానని మీా యజమానితో చెప్పు

మ—అంతేగాని నాకు సమాధానం చెప్పవ్. సరే కానీ. సెలవ్.

వె—సెలవ్.

మ—అరే. సెలవుట. రాయో శిలో వెన్న మనస్సు!

(అంటూ నిరాశతో ఎడమవేపు పోతాడు)

వె—అమ్మగారికి ఇది ఇవ్వాలి. (అని కుడివేపు తిరిగి) అదుగో, అమ్మగారూ యజమానీకూడా వస్తున్నారు (అని కుడివేపు నిష్క్రమిస్తుంది.)

(రెండో తెర లేస్తుంది)

[కుడిమధ్యనించి సంతానమూ అతని వెనకాల అలారమూ వస్తారు. కుడి ఎదరకొచ్చి అలారం నిలబడుతుంది. మధ్య ఎదరకొచ్చి సంతానం కుడివైపు తిరిగి నుంచుంటాడు]

సం—నేను చపటని కాను. నే విన్నది నిజమే. నాకళ్ళు పెద్దవే. నా కళ్ళల్లో దుమ్ముచల్లడం తేలికపని కాదు.

జీ—(ఎడమమధ్యకి వచ్చి సంతానానికి కనపడకుండా అలారానికి కనిపిస్తూ ఆగుతాడు)

సం—వివాహానుబంధం అంటే నీకు అంత అల్లాటప్పా వ్యాపారంగా ఉంది.

జీ—(అలారానికి నమస్కరిస్తాడు)

అ—(జీవన్‌కి వందనం చేస్తుంది)

సం——(అది తనకే అనుకుని) అబ్బో, ఈ మర్యాదః కేం పోదూ! నీకేమీ తెలియదని నేననుకుంటాననీ!

అ——మీా రనుకుంటారని కాదు, నేచేసింది.

సం——ఆఁ. నీ ఉద్దేశాలు నాకు తెలుసు లేస్తూ.

జీ——(అలారానికి మళ్ళీ నమస్కరిస్తాడు)

అ——(జీవన్‌కి మళ్ళీ నమస్కరిస్తుంది)

సం——(అది మళ్ళీ తనకే అనుకుని) చాల్చాలు నీ వేళాకోళాలు. మరి తగ్గించు. నువ్వు నన్ను మన్నించనక్కర్లేదు, పెళ్ళిలో నువ్వు చేసిన శపథం మన్నించు.

అ——(జీవన్‌కి సంజ్ఞగా తల ఊపుతుంది)

సం——(అదీ తనకే అన్వయించుగుంటూ) సరిసరి. తల ఊపీ లాభంలేదు, మూతి విరుచుగునీ ప్రయోజనంలేదు, భుజాలు ఎగరేసీ కార్యంలేదు.

అ——మీారనుకుంటున్నారు, అల్లా.

సం——ఎందుకు అనుకోకూడదూ! నాది గొప్పపుట్టుక కాకపోయినా తప్పుడుపుట్టుక కాదు.

జీ——(కొంచెం మాట్లాడదల్చినట్టు అలారానికి సంజ్ఞ చేస్తాడు)

సం——(వెనక్కి తిరిగి చూడగా, జీవన్ సవినయంగా నమస్కరించి ఎడమ ఎడరకి నిష్క్రమిస్తాడు. సంతానం అలారానికేసి తిరిగిచూసి, నిర్ఘాంతపోతాడు) ఇదుగో, మీా వాడూ! నీకోసమే.

అ—నా తప్పేముందీ ?

సం—తప్పునాదా ?

అ—మీకే తెలియాలి. నేనేం జెయ్యనూ ?

సం—భార్య చెయ్యవలిసింది చెయ్యి. ఇవతల్నించి ఏదో హుషారీ లేకపోతే తుంటర్లు పేట్రేగరు. ఇవతల వికారాల్నిబట్టి తేనెకి ఈగల్లాగ వాళ్ళు మూగుతారు. ఈగల్ని తోలుతూండాలి.

అ—నే నెందుకూ తోలడం ?

సం—అందంగా ఉండడంచేత.

అ—నేను అందకత్తెనని వాళ్ళనుకుంటే, మీరు ఏడుస్తూ నన్ను కూడా ఏడవమంటారే !

సం—ఏడవక భర్త ఎంజెయ్యాలీ అటువంటప్పుడు ?

అ—బుద్ధిగలవాడు చేసేపని చెయ్యాలి.

సం—క్షమించాలి మా వంశంలో ఇటువంటి పోకులు ఎరగం.

అ—ఎక్కడా అంతే. ఒకమాటు ఎరుగుండడం ప్రారంభిస్తే క్రమేపీ అలవాటవుతుంది.

సం—నే చెప్పినట్టు నువ్వు చెయ్యాలి. నిన్ను పెళ్ళి చేసుగోలేదూ నేనూ ?

అ—చేసుగుంటే మాత్రం! పెళ్ళంటే జన్మఖైదా, సన్యాసమూ, ఏకాంతమరణమూ ? ఏమిటి విూ జులుం !

భార్య అంటే భర్త పరోక్షంలో చచ్చి భర్తృసమక్షంలో మాత్రం బతికిఉండేదా ?

సం—పెళ్ళిసమయంలో నువ్వు ఎన్నిశపథాలు చేశావ్?

అ—మీరుమాత్రం చెయ్యలేదూ ? పైగా ఆ శపథాలన్నీ నా చేత చెయింపించారుగాని, నే చెయ్యలేదు. నేవచ్చి మీ కాళ్ళమీద పడ్డానా నన్ను పెళ్ళిచేసుగోండని? మావాళ్ళు మీతో మాట్లాడుకున్నారు. అందుకని మీరు నా తల్లిదండ్రుల్ని పెళ్ళాడారన్నమాటగాని, నన్ను పెళ్ళాడలేదు. తక్షణం వెళ్ళి, మా అమ్మ లేదుగనక, మానాన్న దగ్గిరికెళ్ళి ఏడవండి. నేను బుద్ధిపూర్వకంగా నా హృదయం ఒకా చేతులోపెట్టి తరవాత అతిచరిస్తే అప్పుడూ నా దోషం. ఇప్పుడైనా, స్నేహితుల్తో మాట్లాడుతున్నానేగాని మరేమీ లేదు. నేను హీనంగా వర్తించలేదు, వర్తించలేను. ఇంతవరకు మీరు అదృష్టవంతులే, సంతోషించుగోండి.

సం—అల్లాకాదు, నేను భర్తని గనక శాసిస్తున్నాను. ఆస్నేహాలు నాకు కిట్టవ్.

అ—అల్లాకాదు. నేను భార్యనిగనక శాసిస్తున్నాను. ఆస్నేహాలు నాకు కిట్టుతాయి.

సం—ఔర ! (తనలో) తుంటర్లు మరి దీని వెంటపడకుండా దీని మొహం బద్దలు కొట్టాలని నా ఊహ. కాని, నాకు ధైర్యం ఎక్కడేడిసింది! ఒరేయ్ సంతానం. (అంటూ ఛాతీ చరుచుగుని తనకేసి చూసుగుంటూ) దాన్ని వొది

లేసి పోరా! (మెడపట్టుగుని గెంటుకుంటూ) వీధులోకి విరగ డైపో! (అనుకుని ఎడమ మధ్యకి పోతాడు)

వె—(ఎడమ ఎదర్నించి వస్తూ) ఇదుగో. (అని చీటీ యిస్తుంది)

అ—(చీటీ విప్పి చూస్తూ) తగ్గ సమాధానం రాసు గొస్తా నుండు. (అని కుడిమధ్యకి వెడుతుంది.)

జీ—(ఎడమ మూలనించి వస్తూ) ఏయ్! (అని ఈల వేస్తాడు)

వె—(ఎడమ మూలకేసి చూసి, రమ్మని సంజ్ఞ చేస్తుంది)

జీ—(ఎడమ ఎదరకి వస్తాడు)

మ—(జీవన్ వెనకాలే వస్తాడు)

వె—మా గొప్ప రాయబార్ని కుదుర్చుగున్నారే!

జీ—ఏంజెయ్యనూ! కొంచెం క్రాకేగాని, మంచివాడు, వెనక పరిచితుడు. స్వంతనౌఖర్లని నమ్మలేక ఇల్లా చేశాను. నువ్వీ బహుమతీ పుచ్చుగో (అని సొమ్మిస్తాడు)

వె—(బహుమతీ పుచ్చుగుంటూ) సేవకురాల్ని.

జీ—ఉత్తరం?

వె—ఇచ్చాను. సమాధానం రాసుగు రావడానికి వెళ్ళారు.

జీ—ఇప్పుడు...లోపలికి...

వె—వెళ్ళొచ్చు, రండి (అంటూ కుడిమధ్యకి నడుస్తూ) భుజమాని ఇంట్లో లేరు.

మ—పోనీ నేనుకూడా రానాండి.

జీ—పోనీ వద్దు. నువ్వెళ్ళిపో.

మ—(ఎడమ మూలకి పోతూ) నా కాబోయే పెళ్ళాం ఎంత గడుసుదో! నలుగుర్ని బుట్టలో పెట్టగల్దు. (అంటూ గర్వంగా ఎడమ మూలకి పోతాడు)

(రెండో తెర పడుతుంది. ఎడమ నించి జోరుగా నడుచుకుంటూ మహాదేవయ్య వచ్చి కుడి ఎదరికి పోతూండగా, వెనకాలే సంతానం వెడతాడు.)

సం—ఏమయ్యోయ్!

మ—(వెనక్కి తిరిగి చూసి) పో పో. వాగుడుకాయి! నీ నోటికి తలుపూ తాళమూ లేదు.

సం—అదేమిటి?

మ—ఏమిటా! ఇది ఎక్కడా పొక్కనియ్యకయ్యా నీ మొహం ఈడ్చా అని నీతో ఒక రహస్యం చెప్పేస్తిని కదా, నువ్వెళ్ళి ఈ యజమాని చచ్చినాడికి టపామోనేశావు. గోలయింది. పో పో.

సం—సంగతి ఏమిటంటే...

మ—ఛీ పో. నీ దగ్గిర గుట్టులేదు. ఉంటేనా! ఈ క్షణంలో ఏమేమి జరుగుతూన్నదో నీతో చెప్పి ఉండేవాణ్ణి. ఇప్పుడికి చచ్చినా చెప్పను.

సం—ఆఁ, ఏమిటీ? ఈ క్షణంలో ఏమేమి జరుగుతూన్నదో అదా?

మ—(చప్పరించి) అబ్బే ఏమీ లేదు, ఊరికే అన్నాను.

సం—ఒక్క క్షణం ఆగండి.

మ—నేను ఆగను.

సం—ఒక మాట.

మ—అబ్బో ! నా దగ్గిర్నించి ఇంకా రహస్యాలు పిండా లనీ !

సం—భ భ కాదు.

మ—నా కామాత్రం బోధపడుతుంది. నన్ను మూర్ఖణ్ణి చెయ్యాలని మీరు చూస్తున్నారు.

సం—మిమ్మల్ని మూర్ఖణ్ణి చెయ్యక్కర్లేదు. ఒక సంగతి.

మ—నేను వినను. నీగోల నాకొద్దు. ఎల్లాగో అల్లాగ నన్ను బెల్లించి మా యజమాని వెన్నకి సొమ్మివ్వడమూ అది మా యజమాన్ని లోపలికి ప్రవేశపెట్టడమూ మొదలైన గ్రంథం యావత్తూ నా దగ్గిర్నించి లాగాలని ! అలాంటి వన్నీ నీతో చెప్పేసెయ్యడానికి నేను మూర్ఖణ్ణా !

సం—ఉండుండు, ఏమిటీ ?

మ—నే నుండను.

సం—సొమ్మిస్తా.

మ—(వద్దని సంజ్ఞ చేస్తూ, విజయం తనదే అయినట్టు నవ్వుతూ ఈల వేసుకుంటూ, ఇటూ అటూ ఊగుతూ, ఎడమ ఎదరనించి వెళ్ళిపోతాడు).

సం—(తనలో) ఈ మూర్ఖుడు కక్కేసింది నిజమేమో! నిజమేఅయి ఆ సరసుడు ఇప్పట్లో నా యింట్లోఉంటే, నా మామగారు పిశాచాన్ని ఈడ్చుగొచ్చి, వీళ్ళని బరిమీద పట్టించేస్తాను. ఈ పళంగా నేను ఇంట్లోకి వెడితే వాడు ఉడాయించేస్తాడు, మరి నాకు సాక్ష్యం ఉండదు. లోపలి కెళ్ళి చూడకపోతే, వాడిప్పుడు ఇంట్లోనే లేడేమో! అల్లాం టప్పుడు నేను మళ్ళీ గాడిదనవుతాను మధ్య. అయినా ఈ తలుపు సందులోంచి చూద్దాం. (అని కుడిమధ్యకి జరిగి చూడ్డం అభినయిస్తూ) ఒరేయ్ సంతానం! కళ్ళారా చూశావురా. సందేహంఉంటే మళ్ళీ చూడరా! నీయింట్లో ఎయింటిది మరోడికి స్వాగతం ఇస్తోంది. మరి శీఘ్రంగా అత్తారింటికి దారట్టి, మామగారు ఘటాన్ని లాక్కురారా అని గబగబా ఎడమ ఎదరకి పరిగెడతాడు)

[రెండో తెర లేవగా, జీవన్—అలారాలు కుర్చీలమీద ఉంటారు. జీవన్ డమ మధ్యకేసి చూడ్డానికి వీలుగానూ, అలారం కుడివేపు ముఖంపెట్టి ంటారు].

అ—మిమ్మల్ని గప్పించా నన్న మాటేగాని, నాకూ హాడులుగా ఉంది.

జీ—నేను వచ్చానన్న మాటేగాని, నాకూ హాడులుగా ంది.

అ—నన్ను మీరు క్షమించాలి.

జీ—నన్నుకుడా మీరు క్షమించాలి.

అ—దైవసాక్షిగా చెబుతున్నాను, నాకేమీ దురుద్దేశం లేదు.

అ—దైవసాక్షిగా చెబుతున్నాను, నాకు చాలా సదుద్దేశం ఉంది.

అ—నాభర్తగారి చర్యచూస్తే నాకు అసహ్యం వేసింది.

జీ—వారి చర్య వింటే నాకు అసహ్యం వేసింది.

అ—నాభర్తగారి అనుమానరోగం కుదర్చాలని నాకు అనిపించింది.

జీ—వారి రోగం కుదర్చాలని నాకూ అనిపించింది.

అ—కాని, నా కిప్పుడు చాలా భయం వేస్తోంది.

జీ—నాకు మీ కంటె భయం వేస్తోంది.

అ—నా భయం అంతా ప్రపంచం ఏమి అర్థం తీస్తారో అని.

జీ—నా భయం కూడా అంతే.

అ—అయినా సరే సాయం కోరి మిమ్మల్ని రమ్మన్నాను.

జీ—నేనూ సాయం చెయ్యడానికే వచ్చాను.

అ—అయితే మీరు నా బాధ లన్నీవిని, నా సంసారం చక్కపరచడం నిమిత్తం నా భర్తకి బుద్ధిచెప్పాలనే సంకల్పంతో వచ్చారనుకుంటాను.

జీ—అవును.

అ—ధన్యురాల్ని.

జీ—మరి వెళతాను, రాత్రి రానా ?

అ—రాత్రే ?

జీ—అవును, మీా భర్తగారి అనుమానం ఎంత కలదో అంతా పైకొచ్చేస్తుంది, తీరిపోతుంది.

అ—సరే రండి. చూస్తాను, నాధైర్యాన్ని బట్టి.

జీ—(ఎడమ మధ్యకి చూసి, కుడి ఎడరికి జరిగి) ఏమీా అక్కర్లేదూ! అన్నీ ఇప్పుడే పరిష్కారం అవుతాయి. మీా నాన్నా భర్తా వస్తున్నారు. అని తలవంచి, కళ్ళుమూసుగుని, దణ్ణంపెట్టి, నుంచుంటాడు)

అ—(జీవన్‌తో మెల్లిగా) మీా రుందుహూ, నే చెబుతానూ!

సం— } (ఎడమఎడరకొచ్చి, చూసి, వెనక్కిపోతారు)
శ్రా— }

అ—(తీవ్రంగానూ, కోపంతోనూ) ఇదేనా నీ వరస! నిన్నూ నన్నూ గురించి ఊరూ నాడూ ఏకమై యాగీచెయ్యడమూ! నువ్వొచ్చి ఏమీా లేదని చెప్పడమూ! మళ్ళీ ఇప్పుడు ప్రేమగీతాలు రాసుగుని నువ్వు ప్రత్యక్షం అవడమూ! ఎంత పొగరూ! నే నూరికే గాజులు తొడిగించుగుని కూచున్నా ననుకున్నావా, సాని ననుకున్నావా ? మా నాన్న గనక ఇది విన్నాడంటే నిన్ను నిలువునా చీరి ఊరగాయ పెట్టేస్తాడు, మంచి వాళ్ళు పైకి చెప్పుగోరు. నేనూ [illegible]న్నను.

(అంటూ కుడిమధ్యకి జరిగి కర్ర కావాలనే సంజ్ఞ చేసి) నీ రోగం నేనే కుదురుస్తా. అన్నీ పడి ఊరుకోడానికి పిరికిపందని గాను.

(అని అందించిన కర్రపుచ్చుగుని) ఏం జెయ్యనూ? నీ గొప్ప తనం ఇల్లా కర్ర దెబ్బల పాలౌతోంది.

(ముందు సంతానం వస్తాడు. జీవన్ ఇటూ అటూ పరిగెడతాడు. కర్రపుచ్చుగుని అలారం అతణ్ణే వెంటాడుతుంది. అతడు సంతానం వెనకాల దాక్కోడానికి యత్నించగా, అతడి మీాద పడవలిసిన దెబ్బలు సంతానానికే తగుల్తాయి.

శ్రా—(కుడా వస్తాడు.)

జీ—(తనకే తగిలినట్టు) బాబో, బాబో, అంత గట్టిగా వద్దు నిమ్మళం నిమ్మళాం!

అ—అయితే మరి బుద్ధి తెచ్చుగుని దయచెయ్!

(అని, అప్పటికి తండ్రిని చూసినట్టు నటించి)—ఇదుగో, నాన్నగారూ! ఎప్పుడొచ్చారు?

శ్రా—ఇప్పుడే ఇప్పుడే. నీధైర్యం చూశాను, వంశ మర్యాద నిలబెట్టడానికి నువ్వు కర్ర ప్రయోగించడం గమనించాను. ధన్యోణ్ణి. అల్లుడా! ఇప్పుడేనా నీకు బోధపడిందా యథార్థం? దిక్కుమాలి అనుమానంతో కుళ్ళక, ఇకన్నుణ్ణించేనా తిన్నగా బతుకు.

సం—పోదురూ చెప్పొచ్చారు!

శ్రా—నువ్వు ఎంతో ఆనందించ వలిసిన సమయం ఇది.

సం—(తనలో) అవును. వీరిద్దరూ చెరో మూలా కూచుని ఏడవవలిసిన సమయం కుడానూ.

శ్రా—ఊరుకుంటావేం? నీ భార్యని అభినందించు.

అ—నీ అభినందనాలు నాకొద్దు, నే పోతాను. (అని వడిమధ్యకి నిష్క్రమిస్తుంది)

జీ—శ్రావణానికి నమస్కరించి ఎడమ ఎడర్నించి పోతాడు)

సం—(తనలో) హారి పీడిదణ్ణం తగలెయ్యా!

శ్రా—అల్లుడూ! నే పోతాను. ఇంత మాత్రానికేనా నన్ను శ్రమపెట్టావ్?

సం—పోవయ్యా! దాని జిత్తులు నీ కెక్కడ తెలుస్తాయీ!

శ్రా—జిత్తులా? వెళ్ళి మా అమ్మాయిని క్షమాపణ కోరుకో.

సం—అదొక్కటే తరవాయి.

శ్రా—నీచత్వం నీలోనే ఉందిగాని అలారంలో లేదు. బుద్ధిగా మసులు. (అని ఎడమ ఎడరకి పోతాడు.)

సం—(తనలో)—(రొమ్ము బాదుకుంటూ)— ఆసిపెళ్ళాం! ఆసిపెళ్ళాం! ఎంత నేర్చావ్ ఎంత నేర్చావ్! నాభార్య నేర్పువల్ల దాని తప్పులన్నీ ఒప్పులే, నా కర్మంవల్ల నా ఒప్పులన్నీ తప్పులే. నా పని ఇంతేగావును, నాభార్య చేసే తప్పి

దాలకి ఋజువంటూ దొరకనే దొరకదు గావును. హా దైవమా! ఇన్నిన్ని పన్లుచేసి పారేస్తున్నావు కావూ! ఈ విషయంలో నాకు కాస్తంత సాయపడకూడదూ, అడిగే వాడు లేకగాని! ఇంతలోనే నీకొంప మునిగిపోతుందా? చాల్లేస్తూ వింటే ఎవడేనా నవ్విపోతాడూ!

(అంటూ, కళ్ళు మూసుగుని, తల ఊగించుతూ కుడి మూలకి పోతూండగా)

(తెర)

---

## రంగం-3

[సంతానం ఇంటి యెదటి వీధి. కుడివక్క అతని యిల్లు ఉన్నట్టు-కొంచెం చీకటి-మునుగు వేసుగుని జీవన్, మహాదేవయ్యలు ఎ. ఎ. నించి వస్తారు]

జీ—(మెల్లిగా) మహాదేవయ్యా!

మ—అయ్య!

జీ—ఈ కుడివేపుదే వాళ్ళిల్లు.

మ—(చీసుకుంటూ) అల్లానాండీ.

జీ—మరే. నువ్విక్కడ కూచో.

మ—(దీనంగా) కూచుంటానండి.

జీ—కన్నూ కన్నూ కనపడటంలేదు.

మ—(మూలుగుతూ) నా కన్నూ అంతేనండి

జీ—నువ్వు ఏడుస్తూన్నట్టున్నావేం ?

మ—ఏంజెయ్యానండీ ఏడవక ! చీకట్లో సూర్యుడు ఉండడేం ?

జీ—అదా ! నిదానించి చూస్తే ఉంటాడు. కూచో. (అని కుడిమధ్యకి వెళ్ళి చప్పట్లు కొడతాడు)

మ—మీారు అల్లా చప్పట్లు కొట్టారేం ?

జీ—సంజ్ఞకోసం అల్లా కొట్టమంది, వెన్న.

మ—(కుసిళ్ళుతూ) అయ్యో అయ్యో !

జీ—ఏం, ఏం ?

మ—అది చాలా అందంగా ఉంటుందండి.

జీ—అయితే ఏడుపెందుకూ ? దాన్తో మాట్లాడుదుగాని.

మ—(వెక్కి వెక్కి ఏడుస్తూ ఆగి) అది నన్ను పెళ్ళాడ్డానికి ఒప్పుగుంటుందాండీ ?

జీ—ఆసంగతి అది చెప్పాలిగాని, నే నెల్లా చెప్పడం ?

మ—(ఏడుస్తూ ఆగి) ఛీకట్లో చావగొడుతుందేమో !

జీ—పెళ్ళికి పూర్వం వద్దని చెప్పు (కుడిమధ్యకి చూస్తూ) అదుగో వాళ్ళొస్తున్నారు.

[కుడిమధ్యనించి మొదట వెన్నా వెనకాల అలారమూ ముసుగులో వస్తారు. వారపాట్న ఎడమ మధ్యకి పోతూన్న జీవన్ వెనకాల వెన్న వెదుతుంది, మహాదేవయ్య కూచున్న చోటికి అలారం వెదుతుంది.]

అ—ష్.

మ—ష్. వచ్చావా వెన్నా, నా ముద్దు వెన్నా, నా రాతి వెన్నా !

అ——ఎవరు వారూ?

మ——నే నెవర్నీ కాను, నీ ప్రియుణ్ణే వెన్నా!

అ——హ్సా, మాట్లాడకు మహాదేవయ్యా! నేను వెన్నని కాను. నా భర్త గుర్రట్టి నిద్దరోతున్నారు. వచ్చేశాం. వెన్న అల్లా వెళ్ళింది.

మ——అమ్మా, మీరు మీరాండీ!

అ——మరే. ఉండు వెన్నని పంపుతాను. (అని ఎడమ మధ్యకి పోతుంది)

మ——(విచారంగా) అమ్మా క్షమించండి. నేను చచ్చి పోయే లోపల దాన్ని పంపించండి.

(కుడిమూలనించి పడకవేషంలో సంతానంవచ్చి, ఇటూ అటూ తిరిగి, వెతికి ఎడమ ఎదర కూచున్న మనిషిని గమనించి, దగ్గిరికి వెళ్ళి, వీపుమీద చెయ్యి వేస్తాడు.)

మ——(సంతోషంతో) వచ్చావా, వెన్నా! రా! మీ యజమాని, ఇందాకా దెబ్బలు తినడంలోలాగే, మళ్ళీ దూడేశాడు. ఇప్పుడు తెగగుర్రుకొట్టి నిద్దరరోతున్నాడుట! ఈ సంగతి మీ అమ్మగారే స్వయంగా వచ్చి చెప్పి వెళ్ళింది క్షణం కిందట! మీ యజమాని మహా చెడ్డ చిత్రమైన వెర్రి ఘటం! మాట్లాడవేం, వెన్నా? నీచల్లని చెయ్యి నామీద పడగానే, ఎల్లా ఉందో తెలుసా? మీగడ నల్చుకుంటూ పాల్వా తింటూన్నట్టుంది. ఏదీ, నీ పల్లవహస్తం ఇల్లాతే! (అంటూ, వెనక్కి తిరక్కుండానే అందుకోపోయి) ఓయ్

బాబో ! (అని ముఖం మార్చి, భయపడుతూ) ఈ చెయ్యి ఇంత గరుగ్గా ఉందేం చెప్మా !

సం—(చాలా కోపంగా) ఎవర్రా వాడూ ?

మ—ఎవడూ లేడండి. (అని గభుక్కున లేచి, తప్పించుకుని, పరిగెట్టి ఎడమమూలకి పోతాడు.)

సం—అరి పీనుగా ! పారిపోయాడు. కుట్రయావత్తూ ఛీదాగా చెప్పేసి మరీ వెళ్ళాడు. ఇప్పుడు నా ఇల్లాలు ఇంటి లోపల లేదు. ఈపళంగా వెళ్ళి నా మామగారుగాణ్ణి తీసుకు రమ్మంటాను, ఆ దిక్కుమాలివాడు పోనీ యిప్పుడేనా నమ్ముతాడేమో దీని పాడుపన్లు. (కుడి ఎదరికి నడిచి) ఒరేయ్, కాలయ్యా కాలయ్యా ! ఈ కాలయ్యగాడు దొర్లించినా ఓపట్టాన లేవడు. రాత్రి కాపలా అంటే అదీ వాడర్థం. కాని, వాడేగతి. ఎల్లానో దొర్లి వెళ్ళి నా మామగార్ని ఈడ్చుకు రమ్మంటాను.

(అని కుడి ఎదరికి వెడతాడు. జీవన్—అలా రాలూ వెన్న—మహాదేవయ్యలూ ఎడమ ఎదర్నించి వచ్చి ఎడమ మధ్యకి పోతూ, మళ్ళీ ఎడమమూలనించి వచ్చి ఎడమ ఎదరికిపోతూ, ఏవో గుసగుసలు మాత్రం కానిస్తూ తిరిగి ఎడమకి నిష్క్రమిస్తారు.)

సం—(కుడి ఎదరనించి వచ్చి, ఎడమ మధ్యకేసి ఆలకించడం నటించి) ఈవేపున ఏవో గుసగుసలు వినిపిస్తున్నాయి. తప్పకుండా నా భార్యే అయిఉంటుంది. ఇల్లా

వస్తూన్నట్టున్నారు. నేను తలుపు పక్కని లోపలనుంచుని వీళ్ళమాటలు ఆలకిస్తాను. నా భార్య ఎప్పుడింక ఇంట్లో పడాలనుకుంటుందో అప్పుడు వెంటనే, లోపల, తలుపు గడియేసేస్తాను. తన నాన్న వచ్చేదాకా ఈ వయ్యారిభామ దాసీతో సహా వీధుల్లో చిక్కడి ఉంటుంది. అప్పుడే నా నాగోల యధార్థం అని తేలచ్చు (అని నుడిమధ్యకి పోతాడు.)

(ఎడమ ఎదర్నించి మొదట అలారమ్మా, వెన్నా వస్తారు. వెనకాల జీవన్—మహదేవయ్యా వస్తారు.)

వె—అమ్మా, ఆలస్యం అవుతోంది. అయ్యగారు అభాంద్రామనిషి.

జీ—వెన్నా, నువ్వు కఠినురాలవు.

అ—కాదు. ఇక మీరు వెళ్ళిపొండి.

జీ—అప్పుడే ?

అ—మనం చాలాసేపు ప్రసంగించాం కదా !

జీ—అయితేం ? ఇష్ట సంభాషణకి కాలగమనం తెలియదు.

అ—అయితే మరోసారి మళ్ళీ కలుద్దాం.

జీ—మళ్ళీ ఎప్పుడో ఎల్లాగో కలుసుగోడం !

అ—ఎదో చూద్దాం.

జీ—నువ్వు మళ్ళీ భర్తగారి బందిఖానాలో ప్రవేశించాలి గదా అని బాధగా ఉంది.

అ—బాదిఖానా కళేబరానికేగాని మనస్సుకి కాదు కదండీ!

జీ—నీవంటి సుగుణవంతురాలికి అటువంటి పశుప్రాయుడు—కాదు, పశువు—భర్త కావడం కర్మం.

వె—అమ్మా, తొందరపడాలి.

అ—అయ్యా, సెలవు. (అని కుడిమధ్యకి పోతుంది)

వె—(అలారం వెనకాలే వెడుతూంటుంది)

మ—వెన్నా, నాక్కూడా సెలవ్.

వె—(చెయ్యెత్తి వేళ్లు కదుపుతూ నిష్క్రమిస్తుంది)

జీ—
మ— } (ఎడమకి నిష్క్రమిస్తారు)

అ—(అప్పుడే తిరిగివస్తూ) కొంపమునిగింది, వెన్నా! తలుపు గడియేసి ఉంది లోపల. ఆయన లేచారేమో!

వె—భయంలేదమ్మా. కాలయ్యని కేకేద్దాం.

అ—కాలయ్యా, కాలయ్య!

సం—(కుడిమధ్యకేసి పదిఅడుగుల ఎత్తున ముఖం మాత్రం కనపడుస్తూ) ఏమో భార్యగారు! కాలయ్య ఇక్కడలేడు. అర్ధరాత్రివేళ విహారం బయల్దేరావా అర్ధాంగీ!

అ—చల్లగాలికోసం వెడితే తప్పేముందీ!

సం—చల్లగాలి కాదో, వేడినిట్టూర్పులు! సమయం మంచిది. సరసుడు వచ్చాడు. సంభాషణలు విన్నాను. నా మాటకి ఋజువు దొరికింది. మీ నాన్నకోసం కబురు పంపించాను.

అ—అయ్యో, దైవమా!

వె—అయ్యో అమ్మగారూ!

సం—వెన్నా! అమ్మగారికి మంగళహారతి తెస్తునా?

అ—స్వామీ, మీరే నెగ్గారు.

సం—నెగ్గానో లేదో కాని, ప్రస్తుతం నాదే పైచెయ్యి.

అ—ప్రస్తుతమే కాదు పూర్వంకూడా మీదే పైచెయ్యి.

సం—ఇంతవరకూ మీనాన్న కంట్లో దుమ్ము చల్లి నెగ్గేశావు.

అ—నేను అబలని.

సం—అయితేం! నే చెప్పిన ప్రతీ నిజాన్నీ అబద్ధంగానూ నువ్వు చెప్పిన ప్రతీ అబద్ధాన్నీ నిజంగానూ ఋజువు చెయ్యగల నేర్పరివి.

అ—లేదు లేదు. మీరు భ్రమపడుతున్నారు.

సం—కాదు కాదు. నువ్వు కంగారుపడుతున్నావు.

అ—నిమ్మల్ని ప్రార్థిస్తున్నాను, తలుపుతీసి లోపలికి రానీండి.

సం—ఎందుకు లేస్తూ! కాస్సేపు అక్కడా నిలబడుదూ, ముసిలాయన వచ్చి కళ్ళారా చూస్తాడూ!

అ—మా నాన్నవచ్చినా, నేనేమీ దాచను, అబద్ధాలు ఆడను, సమర్థింపులు మొదలెట్టను. నా సంగతి అంతా మీకు తెలిసిపోయిందిగా!

సం—పాపం. గత్యంతరంలేక ఇట్లా అంటున్నావు.

అ—నిజమండీ ! నాదితప్పే, కాదు. నాదేతప్పు, మీాదే ఒప్పు. ఈ మాటుకి క్షమించండి, మానాన్నకి అప్పగించండి. తలుపు తియ్యండి.

సం—ప్రేయసీ, వీలు లేదు.

అ—ప్రాణప్రియా, శరణు శరణు !

సం—(ఈసడిస్తూ) ప్రాణప్రియాట. ఇప్పుడా ! నువ్వు దొరికిపోయావ్ గదాఅని. పాపం ! ఇంత ప్రియంగా నువ్వు నాతో మాట్లాడ్డం ఇదే మొదలు.

అ—ఇల్లాంటి బాధ మీాకు మళ్ళీ ఎన్నడూ కలిగించను.

సం—ఇల్లాంటి తరుణం నాకు మళ్ళీ ఎన్నడూ దొరకదు. ఇది వదల్ను.

అ—జాలి వహించి నామాట ఒక్కటివినండి.

సం—సరే. ఏమిటామాట ?

అ—మీారన్నదంతా నేను ఒప్పుగుంటాను. ఇటువంటి సమయంలో అటువంటి వ్యక్తుల్తో నేను మాట్లాడుతూ కూచోడం తప్పే. కాని, నేను అనుభవంలేని యువతిని. అనుభవశూన్యుల దోషాల్ని అనుభవజ్ఞులు సహించాలి. నాకు ఏ ద్రోహచింతా లేదు.

సం—నువ్వు అల్లా అనేస్తే నేను క్షమించెయ్యాలనిన్నీ ఒకవేళ నేను క్షమించకపోతే క్షమించకపోడం తప్పు నాదే అని దెబ్బలాడచ్చుగదా అని గావును నీ ఊహ !

అ—నా ధోరణి మీాకు కష్టం కలిగించిందే అనండి. అయినాసరే. ఈ ఒక్కమాటూ నన్ను మీా నాన్న చూడ

కుండా కాపాడారా, ఈ విశ్వాసం చొప్పున, యావజ్జీవమూ మీకు విధేయురాలుగానే ఉంటూ మీరే నా లోకం అనే టట్టు వర్తించి, ఇటువంటి సతి మరి భూమ్మీద లేదు, అని పిస్తాను.

సం—ఎన్నికలముందు వాగ్దానాలు ఇల్లానే ఉంటాయి.

అ—దయచూపించండి.

సం—రవంతైనా చూపించను.

అ—మీరు ఉదారులు.

సం—నీవన్నీ పెడదారులు.

అ—హృదయ పూర్వకంగా మిమ్మల్ని వేడుకుంటు న్నాను.

సం—అంతశ్రమ ఎందుకు ఊరుకోండూ! బహిరంగంగా నిన్ను వంచిస్తేతప్ప నాశ్రమ ఫలించదు.

అ—అయితే నేను ఎందుకేనా సాహసించగల్ను. తర వాత మీరు ఏడుస్తారు.

సం—నువ్వెంత సాహసించినా సరే నే నేడవను. సాహ సిస్తావేం?

అ—అవును. నిరాశకి లొంగిపోయి (అని చాకు తీసి) ఈ చాకుతో పొడిచేసుగుంటాను.

సం—ఓ ఓ (అంటూ వెకిలిగా నవ్వి) ఆ చాకు వొట్టి బండచాకు గావును. నిక్షేపంలా పొడుచుగో. నాకేం?

అ—(తీవ్రంగా) నా కేమా! మీకాక్కాకపోతే మరెవ రికి? జాగర్త! మన పోట్లాటలూ నా మొడల మీ నిర్దయా

అంతా ఎరుగుదురు నా మరణం మీ మూలాన్నే అని జనం నమ్ముతారు. అప్పుడు మా నాన్న మీ మీద కసి తీర్చుగుంటాడు. ఇటువంటి సమయాల్లో స్త్రీలు సాహసించడం ఆదినించీ వస్తూనే ఉంది.

సం—క్షమించాలి ఇల్లాంటి సాహసాలు స్త్రీలు పూర్వ కాలంలో చేసేవారు. బండచాకుతో పొడుచుగోవడం అనేది అట్టే నాజూకు పద్ధతి కాదు, ఏమనుకున్నావో గాని!

అ—నాది పొత్తిబెదిరింపు అనుకోకండి. వెంటనే మీరు తలుపు తియ్యకపోతే, నా శవం ఇక్కడ పడి ఉంటుంది.

సం—ఎందుకొచ్చిన మాటలు పోదూ! ఈ మాటల్తో నేను హడిలి పోతాననే!

అ—అయితే సరే. ఈ హత్య తప్పదు. (అని, చాకుతో పొడుచుగున్నట్టు నటించి) హా! దైవమా! ఈ అవస్థ నా కెవరు తెచ్చారో, వాళ్ళకి తగ్గశాస్తి చెయ్యి. (అని పడి పోవడం నటిస్తుంది)

సం—అయ్యో రాక్షసీ! ఇది అన్నంతపనీ చేసెయ్య లేదుకద! నాకు ఉరిశిక్ష పడుతుంది కుడాను! దిగి, దీపం పట్టిగెళ్ళి చూడాలి. (అని, అక్కడ కనిపించకుండా దిగి పోతాడు).

అ—(లేచి) వెన్నా వెన్నా! నువ్వెళ్ళి గేటుకి అవతల పక్క దాక్కో, నేను ఇవతలవేపు నక్కుతాను. ఆయన వచ్చి ఇవతల వెతుకుతారు. ఆ సమయంలో ఆయనకి

తెలియకుండా లోపలికెళ్ళి తలుపు వేసేసుకుందాం. (అని అట్లా చేస్తారు).

సం—(చేత్తో దీపం పట్టుగుని కుడిమధ్యనించి వస్తూ) ఇందుకనే స్త్రీ సాహసం అన్నారు. (ఇటూ అటూ వెతికి) శవంలేదే! వెన్న ఈడ్చేసిందేమో శవాన్ని! లేక అది పోడుచుగోనేలేదో! లేక, ఎత్తు నగ్గలేదని వెళ్ళిపోయిందో! పోనీ, పోతే దానికే చిక్కు, వాళ్ళ నాన్నకి మరీ కోపం వస్తుంది. నే పోయి పడుకుంటాను. (అని కుడిమధ్యకి వెళ్ళి అప్పుడే చికాకుగా వెనక్కివచ్చి, కుడి ఎదర నిలబడి) ఆరి దీని తెలివి మండా! తలుపు, లోపల బిగించి ఉంది. నేను కనిపెట్టకుండా లోపలికి పరిగెట్టిందిగావును! (కుడి మధ్యకి జరిగి) ఏయ్, తలుపు తలుపు!

అ—(ఇదివరకు సంతానం తన తల ఇనతలకి పెట్టిన చోటినించే) ఎవరువారూ? మీనా! కనిపించిందా ఇల్లు? నీతిపరుడైన భర్త ఇంటికి రావలిసిన వేళేనా ఇది?

వె—రాత్రంతా తెగతాగి, అమాయికపు పెళ్ళాన్ని ఇంట్లోపడేసి!

సం—(నోరు నొక్కుగుంటూ) హవ్వ! ఇదోటా!

అ—పోవయ్యా తుంటరిశిఖామణీ! నువ్వంటే నాకు అసహ్యం వేస్తోంది. మా నాన్నకి నిన్ను అప్పగించేస్తాను. (అని ఎడమమధ్యకి చూస్తూ) అడుగో వస్తున్నాడు.

శ్రా—(ఎడమమధ్యనించి వస్తాడు)

సం—(కుడిఎదర. చేతులుకట్టి నుంచుంటాడు)

అ—రండి నాన్నగారూ, రండి! ముహూర్తంవేళకి వచ్చారు, మిమ్మల్ని ఏ దేవుడు తీసుగొచ్చాడోగాని! అదుగో మీ అల్లుడుగారు. వీరు నిత్యమూ అనుమానపు నిషాలో ఉంటూన్నా, ఇప్పుడు తాగుడునిషాలోకూడా ఉన్నారు. ఇంటికి ఇప్పుడే దయచేశారు. ఏమిటండీ యీ ఆలస్యమూ అంటే తను ఇంట్లో గుర్రట్టి నిద్దరోతూంటే నేను ఇల్లువిడిచి వెళ్ళానంటూ ఏమిటేమిటో చిత్రవిచిత్రంగా పేల్తున్నారు.

సం—(నెత్తి రెండుచేతులా బాదుకుంటూ) ఆసి మాయలమారీ! నీ కల్పనశాలా!

శ్రా—అల్లుడా, ఏమిటీ అల్లరీ?

సం—ఏమో! ఏదినిజమో అదే అబద్ధం అని తేలుస్తోందీవిడ!

అ—ఇల్లాఉన్నారు నాన్నా ఇందాకణ్ణించి. నన్ను అయినమాటా కానిమాటా అన్నీ అనేశారు. ఈ నరకం నేను మరి భరించలేను.

శ్రా—అయితే అల్లుడువాడా! నువ్వు జొత్తిగా తుంటరికుంకలా కనిపిస్తున్నావే?

సం—(చికాకుగా) నేనా? అల్లా కనిపిస్తూన్నది నేనో మీరో పూర్తిగా చూసిమరీ మాట్లాడండి.

శ్రా—ఛీ ఊరుకో. సిగ్గుంటే, ఈపాటి నువ్వు ఏడవాలి, పీడువు రాకపోతే చావాలీ!

సం—అల్లాగే చేస్తాను. ముందు రెండుముక్కలు వినండి.

అ—వినండి, నాన్నా, వినండి. మహాచిత్రమైన కథ చెబుతారు, చాలా సౌరభ్యంగా ఉంటుంది.

వె—ఆ. సౌరభ్యానికి ఏంలోటూ! అబ్బ! ఇక్కడ దాకా కొడుతోంది కంపు.

సం—మామగారూ! నా ప్రార్థన ఏమిటంటే... (అని శ్రావణాన్ని సమీపించబోతాడు.)

శ్రా—(సంతానం తనకేసి వస్తూండగా) అబ్బబ్బ, అక్కడే ఉండు, తెగవాసన! ముక్కు బద్దలవుతోంది.

సం—ఒక్కమాట వినండి! నేను తాగందే వాసనేమిటి?

శ్రా—ఛ ఛా! ఎడంగా ఉండమంటే, ఏమిటా మీదిమీదికి రావడం! దుర్భరం (అని ముక్కు మూసుకుంటాడు).

సం—సరే ఎడంగానే ఉంటాను. వినండి. దైవసాక్షిగా ఇంకా నేనే యింట్లో ఉన్నాను. అప్పుడు ఆవిడ ఎక్కడికో వెళ్ళింది. ఇప్పుడిప్పుడే వచ్చింది.

అ—ఈ వరసని పేల్తున్నాడు, నాన్నా! ఇక [illegible] వదల్రు.

శ్రా—పడిపోయినట్టే ఉంది. అమ్మాయీ! నువ్వు దిగి తలుపుతీసి, ఇల్లారా!

(అలారమూ, వెన్నా, కుడిమధ్యనించి వస్తారు)

శ్రా—అల్లుడూ, నమస్కట్టు.

సం—ఎందుకండీ?

శ్రా—నీ భార్యని క్షమాపణ కోరుకో,

సం—నేనే?

శ్రా—తక్షణం.

సం—అది నన్ను క్షమాపణ కోరుకోడం పోయి, పై పెచ్చు...

శ్రా—కోరుముయ్! మరి కోరెత్తావంటే, మా వంశం యొక్క చేవ చూపించగల్ను.

సం—(తనలో) హోరి దురదృష్టపు సంతానం! ఏ కాడికి వచ్చిందిరా నీ అవస్థా!

శ్రా—అమ్మాయి, ఇల్లారా. నీ పాదాలు ఇల్లాపెట్టు ఈయన క్షమాపణ కోరుకుంటాడు.

అ—సరే. నాన్నా! వీరు చేసిన పనులకి వీర్ని నేను క్షమించాలా నాన్నా! విడాకులు తీసుకుంటే బతుకుతా నేమో!

శ్రా—కాదమ్మా! అప్పుడు మరీ అల్లరిగా ఉంటుంది. నీకేం తెలుసు! విడాకులకంటె జంటాకులే నయం.

అ—రాజీ నాకిష్టం లేదు నాన్నా!

శ్రా—రాజీఅయి తీరాలి. ఇది నా ఆజ్ఞ.

అ—నే నెంత లేసి మాటలూ బాధలూ పడి తేం గనక, మీ మాట చొప్పున చెయ్యడం నా విధి.

శ్రా—ఇల్లాలా. దగ్గిరికి, రా.

అ—వస్తానుగాని, ఇవి ఈ రోజుమట్టుకే. రేపొద్దున్న ఈయన మళ్ళీ యథాప్రకారమే. ఎప్పటాలే.

శ్రా—రేపటిసంగతి రేపే. (సంతానంతో) అల్లుడా, రా, మోకరించు.

సం—(గుటకేసి, కళ్ళు మిటకరిస్తూ) ఏమిటి మీరనేది? మోకరించనా?

శ్రా—అవును, మోకరించు, తక్షణం.

సం—(ఒక చేత్తో దీపంతోనే మోకరిస్తూ) హా దైవమా (అని శ్రావణంతో) ఏమనాలో కూడా చెప్పండి.

శ్రా—"ఓ ఇల్లాలా, క్షమించు"

సం—ఓ ఇల్లాలా, క్షమించు.

శ్రా—"నావల్ల నేరం వచ్చింది."

సం—నావల్ల నేరం వచ్చింది. (తనలో) పెళ్ళాడ్డం కాదూ!

శ్రా—"ఇకన్నుంచి సరిగ్గా ఉంటాను"

సం—ఇకన్నుంచి సరిగ్గా ఉంటాను.

శ్రా—(సంతానంతో) లే అల్లుడూ లే! మరి ఎల్లాంటి ప్రమాదమూ ఎన్నడూ రానీయకు. రానిచ్చావా నీ భర్తో ద్యోగం దాన్తో ఆఖరు. అంతా ఇంట్లోకి వెళ్ళండి. నేను వెళ్ళొస్తాను (అని ఎడమ మధ్యకి వెళ్ళిపోబోతాడు)

జీ—
మ— } (ఎడమ ఎదరనించి వస్తారు)

జీ—(శ్రావణంతో) నమస్కారమండి.

సం—(జీవన్ని తినేసేలాగ చూస్తాడు)

శ్రా—ఇరుగో! ఏం ఇల్లా వచ్చారు? ఇప్పు డొచ్చారేం?

జీ—మేం వచ్చి చాలా సేపైందండి. ఈ ప్రాంతాన్నే ఉన్నాం.

శ్రా—ఏమిటి సంగతీ?

జీ—నే నెవర్నో తమకి జ్ఞాపకం ఉందాండీ!

శ్రా—లేకేం? చూశాగా.

జీ—ఒక సంగతి తమరు వినాలి. నేను మీ అన్నగారి కుమారుణ్ణి, దత్తుణ్ణి. నా బాల్యం తరవాత నన్ను మీరు చూసుండలేదు. అలారం నన్ను ఎరగనే ఎరగదు. ఈఊళ్ళో నాకు ఉద్యోగం అయింది. మీ రిక్కడే ఉన్నారనీ, ఈ బావగారూ ఇక్కడే ఉన్నారనీ తెలిసింది.

శ్రా—అట్లానా, నాయనా! (అని కౌగిలించుకుంటాడు.)

జీ — ఈ బావగార్ని అనుమానగ్రహం పట్టుగుందనీ, తద్వారా తనకే కాక మన అమ్మాయికి కూడా జీవితం నరక తుల్యం అయిపోతోందనీ నాకు తెలిసి, నేను ఈ పన్నాగం నడిపించాను. సంతానం బావగారూ! నమస్కారం.

సం—చిన్నవాడవు గనక నీకు ఆశీర్వచనాలు, నాయనా! ఎవరి కెల్లా బోధపడాలో అల్లానే బోధపడుతుంది. నా కిప్పుడు తెలిసింది. అలా రానికి తెలుస్తా?

జీ—మొదటిసారి తెలియదు. రెండోసారి చెప్పేశాను.

సం—ఎల్లాగైతేం, మా రక్షకుడివి, నువ్వు!

జీ—ధన్యుణ్ణి!

సం—నీ ఋణం నేను తీర్చగో లేను.

జీ—(శ్రావణంతో) నా సాహసం మీరు మన్నించాలి.

శ్రా—సాహసం పవిత్రం అయినప్పుడు విజయమూ మన్ననా కూడా ఉంటాయి.

మ—(ఏదో జ్ఞాపకం చెయ్యడానికా అన్నట్టు, జీవన్ దగ్గిరికి వెళ్ళి సంజ్ఞ చేస్తాడు)

జీ—అన్నట్టు, బావగారూ! మీవల్ల ఓ ఉపకారం జరగాలి.

సం—చెప్పండి, చెప్పండి, అవశ్యం.

జీ—ఏం లేదూ, మీావెన్న లేదూ?

సం—ఆ, లేకేం, ఉంది.

జీ—దాన్ని కాస్తకొప్పడి మా మహాదేవయ్యని పెళ్లాడే టట్టు చెయ్యాలి.

వె—(వచ్చి) నన్ను ఎవరు కొప్పడ్డా మా ఆయున ఊరుకోరండోయ్ !

సం—ఓసి నీయిల్లు బంగారం గానూ, మీ ఆయన ఎవరే ?

వె—మహాదేవయ్యగారే. (అని మహాదేవయ్య వేదుకగా నడుస్తూండగా అంతా సంతోషంతో చప్పట్లు కొడుతూండగా)

(తెర)



భమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు - కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ, రాయలసీమలోనూ, నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.